# మనవి మాట

రాజ్యప్రణాళికలోని జిల్లావారీ వివరాలు చూపే జిల్లా ప్రణాళికల వరసలో 1959–60 సంవత్సరానికి సంబంధించిన యీ ప్రచురణ నాలుగవది. పుస్తకం మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం పొందు పరచ బడింది. నేటివరకు సేకరించిన సమాచారం ఇందులో చేర్చబడింది. దీనితోపాటు రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్యప్రభుత్వం నాలుగవ సంవత్సరంలో నిర్వహింపదలచిన కార్యక్రమాలుకూడా చేర్చబడినాయి. ఇక రెండవ భాగంలో తంతి తపాలాశాఖ, రైలు మార్గాల అభివృద్ధితోసహా వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించి వివరించబడింది. ఈ ప్రచురణ జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందని, దీనిని మెరుగుపరచే టందుకు జిల్లా పరిషత్తులు సూచనలు చేయగలవని ఆశించబడుతున్నది. ఇంకా సూచనలు ఎవరు పంపినా కృతజ్ఞతతో స్వీకరింపబడతాయి. వీటిని హైదరాబాదులోఉన్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రణాళికాశాఖ డిప్యూటి సెక్రటరీ గారికి పంపవచ్చును.

సి. నరసింహం
ప్రభుత్వ ప్రణాళిక, స్థానిక
పరిపాలనాశాఖ కార్యదర్శి.

హైదరాబాదు.
13—12—1959.

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం, వర్గీకరణ.

ఈ జిల్లా విస్తీర్ణం 5,326 చదరపు మైళ్ళు. ఇందులో 2 రెవిన్యూడివిజన్లు, 6 తాలూకాలు ఉన్నాయి. 1956—57 సంవత్సరంలో ఈ జిల్లాలోని భూమి ఈ క్రింది విధంగా వర్గీకరించబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో. | మొత్తం విస్తీర్ణంలో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 32,67,373 | — |
| అడవులుండే ప్రదేశం | 3,22,695 | 12.6 |
| బీడు భూమి, సాగుకిరిందకురానిభూమి | 2,03,245 | 7.9 |
| వ్యవసాయేతర పనులకు ఉపయోగింపబడుతున్న భూమి | 1,49,726 | 5.8 |
| సాగుకు లాయకీ అయిన బంజరు. | 77,556 | 3.0 |
| శాశ్వత పచ్చిక బీళ్లు, ఇతర పచ్చికబయళ్లు | 2,46,630 | 9.7 |
| సాగుచేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానా రకాలచెట్లు, తోటలు, పంటలు పండే భూమి. | 40,885 | 1.6 |
| ప్రస్తుత బంజర్లు | 2,60 392 | 10.2 |
| ఇతర బంజర్లు | 80,437 | 3 2 |
| సాగుచేయబడే నికరపు విస్తీర్ణం. | 11,77,581 | 46.0 |
| ఒకసారికి మించి సాగుచేయబడే భూమి. | 83,417 | 3.3 |
| మొత్తం పంట భూమి | 12,60,998 | 49.3 |

## వేర్వేరు ఋతుపవనాలవల్ల వర్షపాతం.

(అంగుళాలలో)

| | 1956_57 | 1955_56 | మామూలు |
|---|---|---|---|
| నైరుతీ ఋతుపవనాలు | 35.0 | 32 2 | 33.9 |
| ఈశాన్య ఋతుపవనాలు | 5.2 | 6.0 | 3.3 |
| శీతాకాలం | — | 0.2 | 1 1 |
| వేసవికాలం | 2.5 | 7.4 | 3.2 |
| మొత్తం | 42.7 | 45.8 | 41.5 |

## నీటివనరు, నీటిపారుదల.

సరస్సులు, చెరువులు, బావుల ద్వారా ముఖ్యంగా నీటి పారుదల జరుగుతున్నది. ఈ జిల్లాలో మూడు పెద్ద సరస్సులు ఉన్నాయి. అవి: (1) లక్నారం (2) రామప్ప (3) పాఖాల్ సరస్సులు. ఈ జిల్లాలోని నీటివనర్లు, వాటిద్వారా సాగయ్యే భూమి విస్తీర్ణం వివరాలు క్రింద యివ్వబడినాయి.

## నీటివనర్లు

| | |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు. | 36 |
| 2. ప్రైవేటు కాలువలు. | — |
| 3. బావులు. | |
| (ఎ) గొట్టపు బావులు. | 21 |
| (బి) నీటి పారుదలకొరకు మాత్రమే ఉపయోగింపబడే ఇతరబావులు | — |

(i) ప్రభుత్వం వారివి.

| | |
|---|---|
| (ఎ) రాతికట్టడం గలవి. | 1069 |
| (బి) రాతికట్టడం లేనివి. | 208 |

(ii) ప్రైవేటు వ్యక్తులవి.

| | |
|---|---|
| (ఎ) రాతికట్టడం గలవి. | 14,390 |
| (బి) రాతికట్టడం లేనివి. | 240 |
| 4. గృహకృత్యాలకు మాత్రం ఉపయోగింపబడుతున్న బావులు. | 2694 |
| 5. ఉపయోగంలో లేని బావులు. | 41,664 |
| 6. రిజర్వాయర్లు. | 1 |
| 7. చెరువులు. | |
| (ఏ) నూరు ఎకరాలకన్నా ఎక్కువ ఆయకట్టు గలవి. | 570 |
| (బి) నూరు ఎకరాలకన్నా తక్కువ ఆయకట్టుగలవి. | 2807 |

## నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం.

| | |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువల ద్వారా | 12,932 |
| 2. ప్రయివేటు కాలువలద్వారా | 450 |
| 3. చెరువుల ద్వారా | 2,431,72 |
| 4. బావులద్వారా. | |
| (ఏ) కేవలం నీటి పారుదలకు ఉపయోగింపబడేవి. | 38,848 |
| (బి) ఇతర నీటి పారుదల వనరులకు తోడ్పడేవి. | — |
| (సి) ఇతర వనరులు, (ఊటకాలువలు మొదలైనవి.) | 1,322 |
| 5. నీటిపారుదల జరుగుచున్న మొత్తం భూమి. | 2,96,724 |
| 6. పంటపండే నికరపు భూమిలో నీటిపారుదల జరిగే భూమిశాతం. | 5.1 |

7. ఒకేసంవత్సరంలో ఒకసారికంటె ఎక్కువగా నీటిపారుదల జరిగే భూమి విస్తీర్ణం. 50,530

8. నీటిపారుదలవల్ల పంటలుపండే మొత్తం భూమి విస్తీర్ణం. 3,47,254

9. పంటపండే మొత్తం విస్తీర్ణంలో నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం. 27.5

10. సొంత ఆయకట్టు ఉండే బావులు. 70

11. గుర్తించబడిన నీటి పారుదల వనరులకు తోడ్పడే బావులు. 67

12. నీటిపారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో సొంత ఆయకట్టుండే బావులద్వారా నీటి పారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం. 0.2

13. ఆయిలు ఇంజన్ల సంఖ్య 40

## పంటలు

వరి, జొన్న, మొక్కజొన్న, పప్పు ధాన్యాలు, ప్రత్తి, పొగాకు, వేరు శనగ, నూనె గింజలు ఈ జిల్లాలోని ముఖ్యమైన పంటలు. 1956_57 సంవత్సరంలో సాగుచేయబడిన భూమి, పండించబడిన పంటల వివరాలు ఈక్రింద యివ్వబడినాయి:

| | విస్తీర్ణం (ఎకరాలలో) | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|
| I తృణధాన్యాలు. | | |
| 1 వరి | 3,04,984 | 82,790 (బియ్యం రూపంలో) |
| 2. గోధుమ | 1,309 | 80 |
| 3. జొన్న | 3,66,013 | 51,350 |
| 4. సజ్జ | 10,347 | 3720 |

| | | |
|---|---|---|
| 5. బార్లి | 11 | — |
| 6. మొక్కజొన్న | 81,659 | 9,640 |
| 7. రాగి | 435 | 50 |
| 8. కొఱ్ఱ | 1,027 | 70 |
| 9. వరగు | 2,325 | 170 |
| 10. సామలు | 6,389 | 410 |
| 11. ఇతర తృణధాన్యాలు | 826 | 60 |
| మొత్తం తృణధాన్యాలు. | 8,04,599 | 1,48,330 |

II పప్పు ధాన్యాలు.

| | | |
|---|---|---|
| (1) శనగలు | 8,194 | 700 |
| (2) పెసలు | 1,25,839 | 7230 |
| (3) కందులు | 21,784 | 1350 |
| (4) మినుములు | 825 | 70 |
| (5) ఉలవలు | 22,872 | 1630 |
| (6) ఇతర పప్పుధాన్యాలు | 832 | 70 |
| మొత్తం పప్పుధాన్యాలు | 1,80,346 | 11,050 |

III సంబారాలు.

| | | |
|---|---|---|
| 1) పోకచెక్కలు | — | — |
| 2) మిరపకాయలు | 15,753 | 1,510 |
| 3) అల్లం | 14 | — |

| | | |
|---|---|---|
| 4) పసుపు | 279 | — |
| 5) వెల్లుల్లిపాయలు | 881 | — |
| 6) ధనియాలు | 6,703 | — |
| 7) చింతపండు | — | — |
| 8) ఇతర సంబారాలు | 6 | — |
| మొత్తం సంబారాలు. | 20,636 | 1,510 |

IV చెరకు పంటలు.

| | | |
|---|---|---|
| 1) చెరకు | 4 | — |
| 2) తాటిబెల్లం | — | — |
| 3) ఇతరములు | — | — |
| మొత్తం పంటలు. | 4 | — |

V పండ్లు, కూరగాయలు.

(1) (ఏ) తాజా పండ్లు

| | | |
|---|---|---|
| 1) అరటి పండ్లు | 38 | — |
| 2) నిమ్మజాతికి చెందిన పండ్లు | 1046 | — |
| 3) మామిడిపండ్లు | 3317 | — |
| 4) ఇతర తాజాపండ్లు | 58 | — |
| మొత్తం తాజాపండ్లు. | 4459 | — |

(బి) ఎండు పండ్లు

| | | |
|---|---|---|
| మొత్తం తాజాపండ్లు ఎండుపండ్లు | 4459 | — |
| (2) కూరగాయలు | | |
| (ఏ) బంగాళాదుంపలు | — | — |
| (బి) కఱ్ఱపెండలం | — | — |
| (సి) చిలగడ దుంపలు | 381 | — |
| (డి) ఉల్లిగడ్డలు | 1,562 | 5,200 |
| (ఇ) ఇతర కూరగాయలు | 460 | — |
| మొత్తం కూరగాయలు. | 2,403 | 5,200 |
| మొత్తం పండ్లు, కూరగాయలు దుంపల పంటలతో సహా | 6,862 | — |
| VI వివిధ రకాలకు చెందిన ఇతర ఆహార పంటలు | 30 | — |
| మొత్తం ఆహార పంటలు. | 10,15,447 | — |

## ఆహారేతర పంటలు

| | | |
|---|---|---|
| I నారలు | | |
| 1. పత్తి | 4,267 | 400 |
| 2. బొంబాయి జనుము | 1,790 | 880 |
| 3. జనుము | 2,137 | — |
| 4. ఇతర నారలు | 7 | — |
| మొత్తం నారలు. | 7,201 | 1,280 |

II నూనె గింజలు

ఎ. ఆహారంలో ఉపయోగింపబడేవి.

| | | |
|---|---|---|
| 1. వేరు శనగ | 1,62,815 | 4,173 |
| 2. కొబ్బరి | — | — |
| 3. నువ్వులు | 23,260 | 980 |
| 4. రేప్ విత్తనాలు, ఆవాలు | 632 | — |
| 5. కుసుమలు | 40 | — |
| 6. ఇతరములు | — | — |
| మొత్తం. | 1,86,747 | 42,710 |

బి. ఆహారంలో ఉపయోగించబడనివి.

| | | |
|---|---|---|
| i. ఎల్లగిసె విత్తనాలు | 9 | — |
| ii. ఆముదాలు | 40 373 | 2,310 |
| iii. నిగర్ విత్తనాలు | 325 | — |
| iv. ఇతరములు | 313 | — |
| మొత్తం | 41,020 | 2,310 |
| మొత్తం నూనెవిత్తనాలు | 2,27,767 | — |

| | | |
|---|---|---|
| III అద్దకం రంగులు, తోళ్ళ పరికరాలు. | — | |

IV మందులు, మత్తుపదార్థాలు.

| | | |
|---|---|---|
| 1. కాఫీ | — | — |
| 2. జనుము | — | — |

| | | |
|---|---|---|
| 3. తమలపాకులు | 7 | — |
| 4. పొగాకు | 7 906 | 2,340 |
| 5. ఇతర మందులు మత్తు పదార్థాలు. | — | — |
| మొత్తం మందులు, మత్తుపదార్థాలు. | 7,913 | 2,340 |

| | | |
|---|---|---|
| V | పళుగ్రాసపు పంటలు | 2,675 |
| IV | పచ్చి ఎరువు పంటలు | — |
| VII | వివిధ ఆహారేతర పంటలు | — |

| | |
|---|---|
| 1. మొత్తం ఆహారేతర పంటలు | 2,45,551 |
| 2. మొత్తం పంటభూమి | 12 60,998 |
| 3. ఒకసారికి మించి పంటపండేభూమి | 83,417 |
| 4. నికరపు పంటభూమి | 11,77,581 |

## స్థానిక పరిపాలన

30-9-1959 తేదీనాటికి ఈ జిల్లాలో మహబూబాబాదు, జనగాం, చెరియల్, పార్కాల్, డోర్నకల్లులలో 5 పట్టణ మునిసిపాలిటీలు, వరంగల్లులో ఒక సిటీ మునిసిపాలిటీ, 111 పంచాయతీలు ఉన్నాయి.

## తపాలా ఆఫీసులు

1-4-1959 తేదీ నాటికి ఈ జిల్లాలో ఒక హెడ్ ఆఫీసు, 21 సబ్ ఆఫీసులు, 357 బ్రాంచి ఆఫీసులు, 6 టెలిగ్రాఫ్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలుమార్గాలు

ఈ జిల్లాలోని పడమట జనగాం నుండి తూర్పున ఏరుపాలెం వరకు ఒక రైలు మార్గంఉంది. ఇది కాజీపేట, వరంగల్లుల గుండాపోతుంది. సికిందరాబాదు, హైదరాబాదుల గుండాపోయె బెజవాడ—వాడి పథ్రిన రైలుమార్గంలో యిది ఒక భాగం.

## రోడ్లు

1-4-1957 తేదీ నాటికి ఈ జిల్లాలో 518 మైళ్ళ రోడ్లు ఉన్నాయి. అవి ఈక్రింది విధంగా వర్గీకరించబడినాయి.

| | | మైళ్ళు |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా ప్రభుత్వ రహదారుల శాఖచే నిర్వహించ బడుతున్న రోడ్లు. | 407 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించబడుతున్న రోడ్లు | 36 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 75 |
| | మొత్తం | 518 |

## సహకారం

30-6-1957 తేదీ నాటికి ఈ జిల్లాలో ఒక ప్రభుత్వ మరియు కేంద్రి పరపతేతర సంఘం, 693 వ్యవసాయ సహకార సంఘాలు, 74 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలో సభ్యుల సంఖ్య వరసగా 367;57,468 మరియు 26,742

## విద్య

1956—57 సం. లో ఈ జిల్లాలో ఉన్న విద్యాసంస్థల సంఖ్య క్రింద ఇవ్వ బడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉన్నత పాఠశాలలు. | 10 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు. | 19 |

| | | |
|---|---|---|
| 3. | ప్రాథమిక పాఠశాలలు. | 968 |
| 4. | వయోజన విద్యాకేంద్రాలు. | 38 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యాకేంద్రాలు. | 3 |
| 6. | కళాశాలలు, వృత్తి విద్యాకళాశాలలతోసహా | 2 |
| | మొత్తం. | 1,040 |

## వైద్యం, ఆసుపత్రులు

1956–57 సం. లో ఈ జిల్లాలో 10 జనరలు ఆసుపత్రులు, 6 వైద్యశాలలు ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

రాజ్య ప్రభుత్వోద్యోగులు ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్ర మంత్రాంగశాఖల ఉద్యోగులతోను సంప్రదింపులు జరిపిన తరువాత రెండవ ప్రణాళిక యొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్ల మొత్తాన్ని ఖర్చు పెట్టడానికి నిర్ణయించ బడింది. కానీ రాజ్య ప్రభుత్వంవారు వివిధ విషయాలను పరిశీలించినమీదట, ప్రణాళిక, అభివృద్ధి విషయాలను గురించి సలహాలనిచ్చుటకు ఏర్పాటు చేయబడిన రాజ్య సలహాసంఘములో ఈ విషయాన్నిసమగ్రంగా చర్చించిన మీదట వర్తమాన సంవత్సరంలో ఖర్చు పెట్ట దలచిన మొత్తం రు. 42.03 కోట్లకు పెంచటానికి నిశ్చయించ బడింది. ఈ విధమైన హెచ్చింపు చేయడానికి గల ముఖ్య కారణాలు క్రింద ఇవ్వబడినాయి:—

1. వర్తమాన సంవత్సరపు ప్రణాళికా మొత్తాన్ని హెచ్చించక పోయినట్లయితే రెండవ ప్రణాళికయొక్క చివరి సంవత్సరంలో పూర్తిచేయ వలసిన పనులు ఎక్కువగా మిగిలిపోతాయి.

2. ఎక్కువచేయబడిన మొత్తాన్ని ఖర్చుపెట్టేటందుకు తగినంతగా రాజ్య పరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది.

## రైలుమార్గాలు

ఈ జిల్లాలోని పడమట జనగాం నుండి తూర్పున ఏరుపాలెం వరకు ఒక రైలు మార్గం ఉంది. ఇది కాజీపేట, వరంగల్లుల గుండాపోతుంది. సికిందరాబాదు, హైదరాబాదుల గుండాపోయే బెజవాడ—వాడి పధ్రిన రైలుమార్గంలో యిది ఒక భాగం.

## రోడ్లు

1-4-1957 తేదీ నాటికి ఈ జిల్లాలో 518 మైళ్ళ రోడ్లు ఉన్నాయి. అవి ఈకిరింది విధంగా వర్గీకరించబడినాయి.

| | | మైళ్ళు |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా ప్రభుత్వ రహదారుల శాఖచే నిర్వహించ బడుతున్న రోడ్లు. | 407 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించబడుతున్న రోడ్లు | 36 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 75 |
| | మొత్తం | 518 |

## సహకారం

30-6-1957 తేదీ నాటికి ఈ జిల్లాలో ఒక ప్రభుత్వ మరియు కేంద్రి పరపతేతర సంఘం, 693 వ్యవసాయ సహకార సంఘాలు, 74 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి వీటిలో సభ్యుల సంఖ్య వరసగా 367;57,468 మరియు 26,742

## విద్య

1956-57 సం. లో ఈ జిల్లాలో ఉన్న విద్యాసంస్థల సంఖ్య కిరింద ఇవ్వబడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉన్నత పాఠశాలలు. | 10 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు, | 19 |

| | | |
|---|---|---|
| 3. | ప్రాథమిక పాఠశాలలు. | 968 |
| 4, | వయోజన విద్యాకేంద్రాలు. | 38 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యాకేంద్రాలు. | 3 |
| 6. | కళాశాలలు, వృత్తి విద్యాకళాశాలలతోసహా | 2 |
| | మొత్తం. | 1,040 |

## వైద్యం, ఆసుపత్రులు

1956–57 సం. లో ఈ జిల్లాలో 10 జనరలు అసుపత్రులు, 6 వైద్య శాలలు ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

రాజ్య ప్రభుత్వోద్యోగులు ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్ర మంత్రాంగశాఖల ఉద్యోగులతోను సంప్రదింపులు జరిపిన తరువాత రెండవ ప్రణాళిక యొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్ల మొత్తాన్ని ఖర్చు పెట్టడానికి నిర్ణయించ బడింది. కానీ రాజ్య ప్రభుత్వంవారు వివిధ విషయాలను పరిశీలించినమీదట, ప్రణాళిక, అభివృద్ధి విషయాలను గురించి సలహాలనిచ్చుటకు ఏర్పాటు చేయబడిన రాజ్య సలహాసంఘములో ఈ విషయాన్నిసమగ్రంగా చర్చించిన మీదట వర్తమాన సంవత్సరంలో ఖర్చు పెట్ట దలచిన మొత్తం రు. 42.03 కోట్లకు పెంచటానికి నిశ్చయించ బడింది. ఈ విధమైన హెచ్చింపు చేయడానికి గల ముఖ్య కారణాలు క్రింద ఇవ్వబడినాయి:—

1. వర్తమాన సంవత్సరపు ప్రణాళికా మొత్తాన్ని హెచ్చించకపోయి నట్లయితే రెండవ ప్రణాళికయొక్క చివరి సంవత్సరంలో పూర్తిచేయ వలసిన పనులు ఎక్కువగా మిగిలిపోతాయి.

2. ఎక్కువచేయబడిన మొత్తాన్ని ఖర్చుపెట్టేటందుకు తగినంతగా రాజ్య పరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది.

3. ఇంతకుముందే కలిగించబడిన ఆదాయమార్గాలనన్నిటిని పూర్తిగా వినియోగించుకోవలసిన అవసరం ఎంతోఉంది.

4. ఈ తరహా ప్రణాళికను అమలు పరుచుటకు రాజ్యం యొక్క ఆదాయమార్గాలు చాలినంతగా ఉన్నాయి.

ప్రతి అభివృద్ధి కార్యక్రమంక్రింద కేటాయించబడిన మొత్తం పెంచ బడింది. ఆ వివరాలు మొదటి పట్టికలో చూడవచ్చును.

వర్తమాన సంవత్సరంలో చేయబడిన కేటాయింపు ఇదివరకటి సంవత్సరా లలో చేయబడిన కేటాయింపులన్నిటికన్నా ఎక్కువ. నిరుటిసంవత్సరం మొదటి సారిగ చేయబడిన ప్రణాళిక కేటాయింపుకంటె ఈ సంవత్సరం మొదటిసారిగ చేయబడిన ప్రణాళిక కేటాయింపు రు. 12 కోట్లు ఎక్కువ. నిరుటి సంవత్సరం సవరించబడిన ప్రణాళిక కేటాయింపుకంటె ఈ సంవత్సరం సవరించబడిన ప్రణాళికా కేటాయింపు రు. 7 కోట్లు ఎక్కువ. రెండవ ప్రణాళికయొక్క మొదటి నాలుగు సంవత్సరాలలోను కేటాయించబడిన ప్రణాళికామొత్తం వివ రాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

ప్రతి అభివృద్ధికార్యక్రమంక్రింద చేయబడిన కేటాయింపు ఎక్కువచేయ బడటం ఇక్కడ గమనించవచ్చు. అయితే వివిధ విషయాల పద్దుక్రింద చేయ బడిన కేటాయింపు మాత్రం కొంతవరకు తగ్గింది. 1958-59 సంవత్సరంతో పోల్చిచూసినట్లయితే ఈ సంవత్సరం పరిశ్రమలు, రవాణా, సాంఘిక కార్యక్ర మాల క్రింద ఎక్కువ మొత్తంకేటాయించబడింది. ముందు సంవత్సరాల్లో మాదిరిగానే ఈ సంవత్సరం కూడ వివిధ కార్యక్రమాలకు తగిన ప్రాధాన్యత ఇవ్వబడింది.

వర్తమాన సంవత్సరంలో అమలుజరుపబడే పథకాల వివరాలు, కేటా యించబడిన మొత్తం వివరాలు, సాధించవలసిన లక్ష్యాలు రెండవభాగంలో వివ రించబడినాయి.

ఈ సంవత్సరపు కార్యక్రమంయొక్క స్థూలస్వరూపాన్ని తెలిపేటందుకు గాను 1959-60 సంవత్సరంలో సాధించవలసిన లక్ష్యాల వివరాలు క్రింద తెలుపబడినాయి.

## కొన్ని లక్ష్యాల వివరాలు

| పద్దు | యూనిట్టు | 1959—60 సంవత్సరపు లక్ష్యాలు. |
|---|---|---|
| **1 వ్యవసాయం** | | |
| ఆహార ధాన్యాల ఉత్పత్తి. | 000 టన్నులు. | |
| i. పెద్దతరహా నీటిపారుదల పనులు | ,, | 190.60 |
| ii. చిన్న తరహా నీటిపారుదల పనులు | ,, | 38.70 |
| iii. భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| iv. ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 43 00 |
| v. మేలురకం విత్తనాలు | ,, | 21.00 |
| vi. సస్య రక్షణ | ,, | —— |
| vii. పైకార్యక్రమాల క్రిందఉత్పత్తికిగాను కేటాయింపు చేసిన తరువాత మేలు రకం వ్యవసాయ విధానాలను అవలంబించడానికి. | ,, | 89.60 |
| | | 427.40 |
| ఆహారేతర పంటలవల్ల తగ్గింపు | ,, | 11.30 |
| | | 416.10 |
| చిన్నతరహా నీటిపారుదల పనులు | 000 ఎకరాలు | |
| నీటిపారుదల జరుగుచున్న విస్తీర్ణం | ,, | వివరాలు అందుబాటులోలేవు. |

| | | |
|---|---|---|
| విత్తనాల క్షేత్రాలు. | సంఖ్య | 188 |
| i. విత్తనాల క్షేత్రాల స్థాపన కోసం భూమిస్వాధీనం చేసుకోబడినట్టి క్షేత్రాలు | ,, | — |
| ii. వ్యవసాయ కార్యక్రమాలు ప్రారంభించ బడిన క్షేత్రాలు | ,, | — |
| iii. విత్తనాల ఉత్పత్తిని ప్రారంభించిన క్షేత్రాలు | ,, | — |
| ఎరువులు. | | |
| i. పట్టణాల్లో కంపోస్టు ఎరువు తయారి | 000 టన్నులు | 245.16 |
| ii. గ్రామాల్లో కంపోస్టు ఎరువుల తయారి | ,, | ప్రతి పంచాయతీ లోను 75 టన్నులు |
| iii. పచ్చిఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 టన్నులు | |
| i. అమోనియం సల్ఫేట్ | ,, | 148.40 |
| ii. సూపర్–ఫాస్ఫేట్ | ,, | 47.60 |
| iii. యూరియా | ,, | 19.50 |
| iv. అమ్మోనియం నైట్రేట్ | ,, | 27.50 |
| v. కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |

ప్రభుత్వంచే భూములలో స్థిరపరచబడిన భూముల్లేని కుటుంబాలు. సంఖ్య వివరాలు అందుబాటులో లేవు.

2. పశుసంవర్ధన

| | | |
|---|---|---|
| కీలక గ్రామ పథకం | | |
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |
| కీలక గ్రామాలు | ,, | 66 |

3. సహకార సంఘాలు

| | | |
|---|---|---|
| చిన్న తరహా సంఘాలు | సంఖ్య | |
| పటిష్ఠం చేయబడినట్టివి | ,, | 1,000 |
| క్రొత్తవి | ,, | 1,000 |
| సహకార వ్యవసాయ సంఘాలు | ,, | 12 |
| సహకార వ్యవసాయ సంఘాలు | విస్తీర్ణం ఎకరాలలో | 3,376 |
| సహకార సంఘాలద్వారా ఇవ్వబడే వ్యవసాయ ఋణం. | రూపాయలు (లక్షలలో, సంవత్సరానికి) | |
| స్వల్పకాలిక ఋణాలు. | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| దీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |

4. సామాజికాభివృద్ధి కేంద్రాలు, (జాతీయవిస్తరణ సేవాకేంద్రాల కార్యక్రమంతో సహా)

| | | | |
|---|---|---|---|
| సంఖ్య | సంఖ్య | మొదటి దశబ్లాకులు | 26 |
| | | రెండవ దశబ్లాకులు | 20 |

| | | |
|---|---|---|
| జనాభా | మిలియన్లు | 1.675 |
| ఈ కార్యక్రమం క్రింద తీసుకొని రాబడిన గ్రామాల సంఖ్య. | సంఖ్య. | 1600 |

5. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదలపనులు

| | | |
|---|---|---|
| సంభవమయ్యే అదనపు నీటిపారుదల | 000 ఎకరాలు | 418 |
| అదనంగా నీటిపారుదల కల్పించబడే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| అదనంగా ఉత్పత్తిచేయబడే విద్యుచ్ఛక్తి | 000 కిలోవాట్లు | 29,750 |
| 33 కిలోవాట్లకు మించిన ట్రాన్స్మిషన్ లైన్లు | మైళ్లు | 290 |
| 33 కె. వి. మరియు అంతకంటె తక్కువ ట్రాన్స్మిషను లైన్లు | మైళ్లు | 400 |
| విద్యుతీకరణం చేయబడిన పట్టణాలు, గ్రామాలు | సంఖ్య | 200 |

7. వరద నివారణ

| | | |
|---|---|---|
| రక్షణ కల్పించబడే అదనపు భూమి | 000 ఎకరాలు | 48 |

8. రోడ్లు

| | | |
|---|---|---|
| నిర్మించబడే కంకర రోడ్ల పొడవు | మైళ్లు | 29.4 |

## 9. విద్య

| సంస్థలు | సంఖ్య | |
|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నత పాఠశాలలు | ,, | 18 |
| హైయ్యరు సెకెండరీ పాఠశాలలు | ,, | — |
| బహుళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్య | 4 | — |
| డిగ్రీ / డిప్లొమా | ,, | — |
| వివిధ తరగతుల్లోచేరే విద్యార్థులు | డిప్లొమా<br>డిగ్రీ | 1150<br>360 |
| I వ తరగతి నుండి V వ తరగతి వరకు | ,, | 50,000 |
| VI వ తరగతి నుండి VIII వ తరగతి వరకు | ,, | 20,910 |
| IX వ తరగతి నుండి XI వ తరగతి వరకు | ,, | 6,900 |

ఉపాధ్యాయులకు శిక్షణ.

| | | |
|---|---|---|
| శిక్షణ పాఠశాలలలో చేర్చుకోబడే అభ్యర్థులు (బేసిక్, నాన్ బేసిక్ తరగతులు కలుపుకొని) | ,, | 2,250 |
| శిక్షణ కళాశాలలలో చేర్చుకోబడే అభ్యర్థులు (బేసిక్, నాన్‌బేసిక్ తరగతులు కలుపుకొని) | ,, | 200 |

## 10. ఆరోగ్యం

| ఆరోగ్య కేంద్రాలు | సంఖ్య | |
|---|---|---|
| సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద<br>ఇతర కార్యక్రమాల క్రింద | ,, | 20 |
| కుటుంబ నియంత్రణ కేంద్రాల సంఖ్య | | |
| i పట్టణ కేంద్రాలు | సంఖ్య | 15 |
| ii గ్రామీణ కేంద్రాలు | ,, | 44 |
| శిక్షణ సౌకర్యాలు | | |
| i డాక్టర్లు | ,, | 450 |
| ii నర్సులు | ,, | 120 |
| iii దాయీలు | ,, | 720 |
| vi. సహాయక నర్సు-మంత్రసానులు | ,, | 90 |
| v. మంత్రసానులు | ,, | 158 |

## 11. గృహవసతి

| | | |
|---|---|---|
| పారిశ్రామిక గృహనిర్మాణం<br>నిర్మించబడిన యూనిట్లు | సంఖ్య | 1365 |
| తక్కువ ఆదాయంగలవారికి గృహనిర్మాణం | ,, | — |
| నిర్మించబడిన యూనిట్లు | సంఖ్య ఆర్.సి.ఎస్. | 680 |
| | ,, డి. టి. పి. | 180 |

## 12. కార్మికులు-కార్మిక సంక్షేమం

| | | |
|---|---|---|
| వృత్తి పనివారికి శిక్షణ | ,, | వివరాలు అందుబాటులో లేవు. |
| శిక్షణ కేంద్రాలు | ,, | — |
| శిక్షణ యివ్వబడినవారి సంఖ్య | ,, | 1,816 |

## 13. వెనుకబడిన తరగతులవారి సంక్షేమం

| | | |
|---|---|---|
| షెడ్యూల్డు తెగలు | | |
| స్కాలరు షిప్పులు | సంఖ్య | 2465 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 637 |
| ఏర్పాటు చేయబడిన వైద్యాలయాలు | ,, | — |
| నిర్మించబడిన రోడ్లు | మైళ్లు | 78 |
| షెడ్యూల్డు తెగలు | | |
| స్కాలరు షిప్పులు | సంఖ్య | 4,900 |
| సహాయంచేయబడిన కుటుంబాలు | సంఖ్య | 850 |
| విముక్త జాతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | — |
| పునరావాసం కల్పించబడిన కుటుంబాలు | ,, | 275 |
| ఇతర వెనుకబడిన తరగతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | 5,730 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | — |

## మొదటి పట్టిక.

### 1959_60 సం॥పు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు.

(రూపాయలు లక్షలలో)

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం వివరం. | 1959_60 లో కేటాయింపు. ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్రప్రదేశ్ | మొత్తం ప్రణాళికా కేటాయింపులో శాతం. |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| | వ్యవసాయ కార్యక్రమాలు | 687.142 | 373.080 | 1060.222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి. | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్నతరహా నీటిపారుదల పనులు. | 105.81 | 69.19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.3000 | .... | 5.300 | 0.13 |
| 4. | పశు సంవర్ధన | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడి పరిశ్రమ – పాల సరఫరా | 12.550 | 15.940 | 28.490 | 4.68 |
| 6. | అడవులు, | 16.520 | 21,720 | 38.240 | 0.91 |
| 7. | భూసార సంరక్షణ | 13.810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు. మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | సామాజికాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవాకార్యక్రమాలు | 240.850 | 119.150 | 360,000 | 8.57 |

| | | | | |
|---|---|---|---|---|
| 12. పంచాయతీలను పటిష్ఠం చేయడం | 5.450 | 5.450 | 10.900 | 0.26 |
| నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 994.960 | 711.090 | 1706.050 | 40.60 |
| 13. బహుళార్థ సాధక ప్రాజెక్టులు | 445.000 | 255.000 | 700.000 | 16 66 |
| 14. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | 242.470 | 265.220 | 507.690 | 12.08 |
| 15, విద్యుచ్ఛక్తి | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| పరిశ్రమలు | 219.720 | 75.418 | 295.130 | 7.02 |
| 16. పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | .... | 83.850 | 1.99 |
| 17. గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. చేనేత పరిశ్రమ | 47.120 | 20.780 | 67.90 | 01.62 |
| రవాణా | 145.920 | 64.430 | 210.350 | 5.01 |
| 19. రోడ్లు | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20, రోడ్డు రవాణా | 29.830 | ... | 29.830 | 0.71 |
| సాంఘిక కార్యక్రమాలు | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. విద్య | 188.670 | 143.610 | 323.280 | 7.69 |
| 22. వైద్యం | 88.160 | 61.940 | 150.000 | 3.57 |
| 23. ప్రజారోగ్యం. | 46.054 | 30.390 | 76.930 | 1.83 |
| 24. గ్రామీణ, పట్టణ నీటిసరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.81 |

| | | | | |
|---|---|---|---|---|
| 25. గృహనిర్మాణం | 46.17 | 66. 08 | 112.250 | 2.67 |
| 26. కార్మికులు, కార్మిక సంక్షేమం | 16.510 | 14.050 | 30.560 | 0.73 |
| 27. వెనుకబడిన తరగతుల. షెడ్యూల్డు కులాల సంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. షెడ్యూల్డుతెగలసంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 29. స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. సాంఘిక సంక్షేమం | 19,500 | .... | 19.500 | 0.46 |
| వివిధ విషయాలు | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. రాజధాని అభివృద్ధి | 20.000 | .... | 20.000 | 0.48 |
| 32. మునిసిపలురోడ్లు, అభివృద్ధి పనులు | 11.590 | .... | 11.590 | 0.28 |
| 33. రేడియో ప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0.15 |
| 34. ప్రచారం | 3.760 | 3.040 | 6.800 | 0.16 |
| 35. అర్థ, గణాంకశాఖ | 9.040 | .... | 9.040 | 0.21 |
| మొత్తం | 2611.972 | 1519.546 | 4202 518 | 100.00 |

# వ్యవసాయోత్పత్తి

## విత్తనాల క్షేత్రాలు, విత్తనాల స్టోర్లు

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తిని ఎక్కువచేసే ఉద్దేశంతో ప్రతి బ్లాకులోను ఒకవిత్తనాల క్షేత్రాన్ని స్థాపించవలసిందిగా, ఒక విత్తనాల స్టోరును నిర్మించ వలసిందిగా సిఫారసుచేస్తూ రాజ్య ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వంవారు ఒక నమూనా పథకాన్ని సూచించారు. ప్రతిక్షేత్రంయొక్క వైశాల్యం సగటున 25 ఎకరాలు ఉంటుంది. ప్రతిక్షేత్రానికి రు. 10,000లు ఖరీదయ్యే ఒక విత్తనాల స్టోరు అనుబంధించ బడుతుంది. ఈ పథకం 1957-58 సం. లో అమలు జరుపబడింది. ఇంతవరకు 65 విత్తనాల క్షేత్రాలు. 24 విత్తనాల స్టోర్లు ఏర్పాటు చేయబడినాయి. 47 విత్తనాలస్టోర్లు నిర్మాణంలో ఉన్నాయి. 1959-60 సం. లో 59 విత్తనాల క్షేత్రాలను, 59 విత్తనాల స్టోరులను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 24.60 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో 11 విత్తనాల క్షేత్రాల్ని, 11 విత్తనాల స్టోర్లను ఏర్పాటుచేయటంకోసం పై మొత్తంలో రు. 3.47 లక్షల మొత్తం ప్రత్యేకించ బడింది.

## విత్తనాల అభివృద్ధి, సరఫరా

మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, కాయధాన్యాల విత్తనాలు రిజిష్టరయిన ఉత్పత్తిదారులనుండి కొనబడి ఈ పథకం క్రింద రైతులకు తక్కువ ధరలకు సరఫరా చేయబడతాయి. ఈ విధంగా సరఫరాచేయబడే వరి, గోధుమ, మొక్కజొన్న విత్తనాల ధర మణుగుకు రెండు రూపాయలు. జొన్న విత్తనాల ధర మణుగుకు ఒక రూపాయి. తెలంగాణా ప్రాంతంలో ఈ పథకం 1956-57 సం. నుంచి అమలులో ఉన్నది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతానికి కూడ ఈ పథకం క్రింది సౌకర్యాలను విస్తరింప చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 5.22 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతంలో విత్తనాలను పంచటానికి వినియోగించ బడుతుంది. మిగత రు. 2.31

లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతంలో వినియోగించబడుతుంది. ఈ పథకం క్రింద ఈ జిల్లాలోని రైతులుకూడ ప్రయోజనం పొందుతారు.

## గంధకం సరఫరా, సస్యరక్షణ పద్ధతులను అవలంబించటం.

తెలంగాణా ప్రాంతంలో పంటలకు తగిలే తెగుళ్ళను, చీడల నునివారించే టందుకు పెద్దఎత్తున నివారణచర్యలు తీసుకొనటానికి వీలుగా వ్యవసాయశాఖకు తగుసాధన సామగ్రిని సమకూర్చటమే ఈ పథకంయొక్క ఉద్దేశం. 1956-57 సం. లో ఈ పథకం అమలు జరుపబడి, 1957-58, 1958-59 సంవత్సరాలలో కొన సాగించబడింది. ఈసంవత్సరంలో 50 చేతి స్ప్రేయర్లను (పిచికారీలు), 60 డస్టర్లను (పొడిచల్లు సాధనాలు), 5 పవరు స్ప్రేయర్లను (విద్యుచ్ఛక్తితో పనిచేసే పిచికారీలు) కొని వ్యవసాయశాఖకు సమకూర్చటానికి ప్రతిపాదింపబడింది. ఇంతే గాక 16,38,754 పౌన్ల గంధకం కూడ పంపకం చేయబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది. తెలంగాణా ప్రాంతంలో 40,000 ఎకరాల ప్రదేశం సస్యరక్షణచర్యల క్రిందకు తీసుకురాబడుతుందని ఆశించబడుతున్నది. ఈ జిల్లాలోని భూములు కూడ సస్య రక్షణ చర్యల క్రిందకు తీసుకరాబడతాయి. ఈ జిల్లాలోని రైతులకు 1,55,814 పౌనుల గంధకం కూడ సరఫరా చేయబడుతుంది.

## ప్రయివేటు ట్రాక్టర్లతో వ్యవసాయం

భూములను దున్నుకోవటానికి రైతులకు సరఫరాచేసేనిమిత్తం వ్యవసాయ శాఖవారి దగ్గర చాలినన్ని ట్రాక్టరులేనందువల్ల ట్రాక్టర్లుగల ప్రైవేటు సంస్థలకు ట్రాక్టర్లతో భూమిని దున్నేపని అప్పగించబడింది, ఇందుకోసం ఆ సంస్థలకు ఋణసహాయంకూడ చేయబడింది. ఈ పథకం కొనసాగించే నిమిత్తం యీ సంవత్సరానికి రు. 0.05 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో దరఖాస్తుదారు లెవ్వరైనా ఉంచే వారికికూడ ఈ పథకంక్రింద ఋణ సహాయం లభిస్తుంది.

## అధికాహారోత్పత్తి సిబ్బంది

తెలంగాణా జిల్లాలలోని జిల్లా వ్యవసాయ శాఖాధికార్ల కార్యాలయాల్లో పని బాగా పెరిగింది. తదనుగుణంగా ఈ కార్యాలయాల్లో సిబ్బందిని పెంచటానికి ప్రతిపాదింప బడింది. 1957-58, 1958-59. సంవత్సరాలలో జిల్లా వ్యవసాయ శాఖాధికార్లకు పర్సనల్ అసిస్టెంట్లుగా పనిచేసేటందుకుగాను 9 మంది డెమాన్స్ట్రేటర్లు, జిల్లా కార్యాలయాల్లో పనిచేసేటందుకుగాను 9 మంది అప్పరుడివిజను గుమాస్తాలు, 9 మంది లోయరు డివిజను గుమాస్తాలు, 9 మంది టైపిస్టులు నియమించబడినారు. తాలూకా కార్యాలయాల్లో పనిచేయటంకోసం 9 మంది లోయరు డివిజను గుమాస్తాలు నియమించబడినారు. వీరు యీ సంవత్సరంలో కొనసాగించబడతారు. ఇందుకు రు. 0.98 లక్ష మొత్తం వ్యయమవుతుంది. ఇందులో రు. 0.11 లక్ష మొత్తం ఈ జిల్లాలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించటం కోసం ప్రత్యేకించ బడింది.

## జీలుగ, జనుము వంటి పచ్చి ఎరువు విత్తనాల పంపకం

ఈ పథకంక్రింద ప్రణాళికయొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలోను 239 టన్నుల పచ్చిఎరువు విత్తనాలు రైతులకు పంపకం చేయబడినాయి. 1958-59 సం. లో (అనగా 1958 డిసెంబరు వరకు) 124 టన్నుల విత్తనాలు సరఫరా చేయబడినాయి. మణుగు ఒక్కంటికి ఒక రూపాయచొప్పున వీటి అమ్మకంపై సబ్సిడీ ఇవ్వబడింది. 1959-60 సం. లో 6,300 టన్నుల విత్తనాలు తగ్గింపుధరకు సరఫరా చేయబడుతాయి. ఇందుకుగాను రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.001 లక్ష మొత్తం ఈ జిల్లాలో 125 మణుగుల పచ్చిఎరువు విత్తనాలను సరఫరా చేయటంకోసం కేటాయించబడింది.

## పట్టణాల్లో కంపోస్టు ఎరువు తయారి

తెలంగాణా ప్రాంతంలోఉన్న సిటీ, టౌను మునిసిపాలిటీలలో ఎరువు ఉత్పత్తిని పెంచే ఉద్దేశంతో స్థానిక సంస్థలకు ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. స్థానికసంస్థలు చెత్తచెదారాన్ని కొనుగోలుచేసి వాటిని కంపోస్టు ఎరువుగా మార్చేటందుకు, ధానితయారి, పంపకంమూలంగా వచ్చేనష్టాన్ని

పూడ్చుకొనేటందుకు ఈ ఆర్థికసహాయం ఉద్దేశించ బడింది. ప్రణాళికయొక్క మొదటి మూడుసంవత్సరాల కాలంలోను ఈ పథకంక్రింద స్థానిక సంస్థలచే, 3.00 లక్షల టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తి చేయబడిపంచబడింది. 1959-60 సంవత్సరంలో 1.10 లక్షల టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తి చేయబడుతుందని ఆశించ బడుతున్నది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.16 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.02 లక్ష మొత్తం ఈ జిల్లాలో 9,000 టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తికిగాను ప్రత్యేకించబడింది. ఇది 2,400 ఎకరాలలో ఉపయోగించ బడుతుంది. ఇందుమూలంగా 300 టన్నుల పంట అదనంగా పండుతుంది.

## మేలురకం పండ్ల మొక్కల ఉత్పత్తి

పండ్లతోటలు వేయుటకుగాను రైతులకు మేలురకానికి చెందిన ముఖ్యమైన పండ్లమొక్కల అంట్లు లేక కొమ్మలు యీ పథకంక్రింద సేకరించబడి సరఫరా చేయబడతాయి. సరఫరా చేయబడిన మొక్కల ఖరీదు తక్కావి ఋణం ఏవిధంగా వసూలు చేయబడుతుందో ఆ విధంగా రైతుల నుండి వసూలు చేయబడుతుంది. 20,950 మొక్కల సరఫరా నిమిత్తం రు. 0.18 లక్ష మొత్తం కేటాయింపుతో గత సంవత్సరం అమలుపరచబడింది. ఇంకా 20,950 పండ్ల మొక్కలు సరఫరా చేయటంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.18 లక్ష మొత్తం కేటాయించ బడింది ఈ జిల్లాలో 1,800 పండ్ల మొక్కలను పంపకం చేసే నిమిత్తం పై మొత్తంలో రు. 0.02 లక్ష ప్రత్యేకించబడింది.

## స్థానికంగా లభ్యమయ్యే చెత్త, చెదారాలతో ఎరువుల తయారీ

స్థానికంగా లభ్యమయ్యేచెత్త, చెదారాల నన్నింటిని ఉపయోగించి, అభివృద్ధికరమైన పద్ధతులలో కంపోస్టు ఎరువును తయారు చేయటం ద్వారా గ్రామసీమల్లో ఎరువు ఉత్పత్తియొక్క స్థాయిని పెంచటమే ఈ పథకం యొక్క లక్ష్యం. మొట్టమొదటగా ఈ కార్యక్రమం బ్లాకు ప్రాంతాలలో మాత్రమే అమలు పరచటానికి, ఆ తరువాత రెండవ ప్రణాళికా కాలం పూర్తి అయ్యేలోపున అన్నిప్రాంతాలకు ఈ కార్యక్రమాన్ని విస్తరింపచేయటానికి ప్రతిపాదించ బడింది. 1957-58, 1958-59 సంవత్సరాలలో రాజ్యంలోని 56 బ్లాకులలో ఈ పథకం అమలు

పరచబడింది. స్థానికంగా లభ్యమయ్యే పదార్థాలతో ఎరువుల తయారీని అభివృద్ధి చేయటం గురించి 12,565 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడింది. ఇద్దరు ఫీల్డు మెన్యూరియల్ ఆఫీసర్లు, 23 మంది కంపోస్టు ఇనస్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమన్లు, ఒక అప్పర్ డివిజను గుమస్తా, ఇద్దరు లోయరుడివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, నలుగురు జవానులతో కూడిన ప్రత్యేక సిబ్బంది కూడ ఈ పథకం క్రింద నియమించబడింది. ఈ సిబ్బందిని కొనసాగించటానికి, ఆంధ్ర ప్రాంతంలో 30, తెలంగాణా ప్రాంతంలో 17— మొత్తం 47 బ్లాకులకు ఈ కార్యక్రమాన్ని విస్తరింప చేయటానికి గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో 13,000 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడుతుందని ఆశించబడుతున్నది. ఈ పథకం ఈ జిల్లాలోని క్రింది బ్లాకులకు విస్తరింప చేయడంవల్ల యీ జిల్లా రైతులకు కూడ లాభం చేకూరుతుంది.

1. కొండ కొండ్ల.
2. వార్ధన్నపేట.
3. జనగాం.

## మలమూత్రాదులనుండి కంపోస్టు ఎరువును తయారుచేయటం

గ్రామ పరిశుభ్రతకోసం పాకీ వారిని నియోగించే గ్రామ పంచాయతీలలో లభ్యమయ్యే మలమూత్రాదులు, చెత్త చెదారంతో కంపోస్టు ఎరువును తయారు చేయటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఆంధ్ర ప్రాంతంలో 66 పంచాయతీలకు, తెలంగాణా ప్రాంతంలో 33 పంచాయతీలకు—మొత్తం 99 పంచాయతీలకు అప్పులివ్వటం కోసం 1958-59 సం. లో రు. 2.00 లక్షల మొత్తం మంజూరు చేయబడింది. ఈ సంవత్సరంలో కూడ ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలోని పంచాయితీలకు ఋణాలను ఇచ్చేటందుకై రూ. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని పంచాయతీలకు ఇవ్వబడుతుంది. సుమారు 8,000 టన్నుల కంపోస్టు ఎరువు తయారు చేయబడుతుంది. ఇది 160 ఎకరాలలో ఉపయోగించ బడుతుంది. ఇందు మూలంగా ఈ జిల్లాలో 20 టన్నుల పంట అదనంగా పండుతుంది.

## చేతితో నడుపబడే స్ప్రేయర్లను (పిచికారీలు), డస్టర్లను (పొడిచల్లు సాధనాలు) తగ్గింపు ధరకు సరఫరా చేయటం

పెద్ద ఎత్తున పంటలకు వ్యాధులు తగిలినప్పుడు త్వరగా సస్యరక్షణ చర్యలను తీసుకొనేటందుకు వీలుగా వ్యవసాయదారులు, సహకార సంఘాలు, పంచాయతీలు మొదలైనవి తగినన్ని స్ప్రేయర్లను, డస్టర్లను స్వంతంగా కలిగియుండేటట్లు చేయడమే ఈ పథకంయొక్క ఉద్దేశం. ఈ పరికరాలు సగం ధరకు సరఫరా చేయబడతాయి. మిగత సగం ధర కేంద్ర, రాజ్య ప్రభుత్వాలు భరిస్తాయి. 500 చేతి స్ప్రేయర్లను, డస్టర్లను కొనేటందుకుగాను 1958-59 సంవత్సరంలో రు. 0.90 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇంకా 500 స్ప్రేయర్లను, డస్టర్లను కొనటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.90 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.036 లక్ష మొత్తం విలువ చేసే 20 స్ప్రేయర్లు, డస్టర్లు ఈ జిల్లాలో సరఫరా చేయబడతాయి.

## ఆంధ్ర ప్రదేశ్‌లో పండ్లతోటల అభివృద్ధి

ప్రస్తుతం పండ్ల తోటల క్రింద ఉన్న ప్రాంతాన్ని అభివృద్ధిచేసి, క్రొత్త ప్రాంతాలను పండ్లతోటల క్రిందకు తీసికొని రావటంద్వారా పండ్ల ఉత్పత్తిని పెంచే ఉద్దేశంతో వ్యవసాయోత్పత్తిని వివిధ రకాలుగా అభివృద్ధి పరచి పండ్ల పంటను ఎక్కువ చేయాలనే ప్లానింగు కమిషను వారి సిఫారసులను పురస్కరించుకొని ఈ పథకం 1957-58 సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ పథకం క్రింద రైతులకు పాత తోటల సముద్ధరణ కొరకు ఎకరానికి రు. 65లు చొప్పున స్వల్పకాలిక ఋణాలు, క్రొత్త ప్రాంతాలను పండ్ల తోటలక్రిందకు తీసికొని వచ్చేటందుకు ఎకరానికి రు. 150 లు మొదలుకొని రు. 300లు వరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వటానికి ఉద్దేశించబడింది. 1957-58, 1958-59 సంవత్సరాలలో రు. 11.00 లక్షల మొత్తం ఋణాలుగా ఇవ్వబడింది. ఈ పథకాన్ని కొనసాగించటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 8.86 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.36 లక్షల మొత్తం కడప జిల్లా, అనంతరాజు పేటలో ఉండే ఫ్రూట్ స్పెషలిస్టు వద్ద రిజర్వుగా ఉంచబడింది. అవసరమయిన జిల్లాలకు

ఇది పంచబడుతుంది. మిగత మొత్తంలో రు. 0.344 లక్ష మొత్తం ఈ పథకం క్రింద ఈ జిల్లాలో ఋణాలివ్వటం కోసం వినియోగించ బడుతుంది.

## ప్రత్తిపంట అభివృద్ధి పథకం

రెండవ ప్రణాళికా కాలంలో బీళ్లను, బంజరు భూములను సాగులోనికి తేవటం, ఆహారేతర పంటలను తొలగించడం, రెండుపంటలను వేయడం, మిశ్రమ వ్యవసాయాన్ని అవలంబించడం, మేలురకం విత్తనాలను సరఫరా చేయడం, రసాయనిక ఎరువులను వాడడం మొదలైనట్టి చర్యలను అవలంబించడం ద్వారా 20,000 బేళ్ల వరకు ప్రత్తి ఉత్పత్తిని పెంచటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క బేలు 392 పౌనుల బరువు ఉంటుంది. రెండవ ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాల కాలంలోను ప్రత్తి ఉత్పత్తి 12,000 బేళ్ళదాకా పెరిగింది. ఈ పథకంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.40 లక్షల మొత్తం కేటాయించబడింది.ఈ పథకాన్ని అమలు జరపడానికి, విత్తనాలను కొని పంచడానికి బాధ్యులైన క్రింది ఆఫీసర్ల ఆధీనంలో పై మొత్తం ఉంచబడింది.

| | రూపాయలు లక్షలలో. |
|---|---|
| 1. కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయశాఖ డైరెక్టరేటు. | 0.9190 |
| 2. అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, అదిలాబాదు. | 0.1495 |
| 3. అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, కడప. | 0.1743 |
| 4. అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, గుంటూరు. | 0.1572 |
| మొత్తం. | 1.4000 |

ఈజిల్లాలో 50 ఇంపీరియల్ మణుగుల ప్రత్తి విత్తనాలు పంచబడతాయి. ఇవి 400 ఎకరాలలో నాటబడతాయి. ఇందు మూలంగా అదనంగా 43 బేళ్ళ ప్రత్తి ఉత్పత్తి చేయబడుతుంది.

## చెరకు పంటకు ఎరువు విస్తారంగా వేయడానికి సంబంధించిన పథకం

పంట దిగుబడి ఎక్కువగా ఉండేటందుకోసం చెరుకు పంటకు బాగా ఎరువుల్ని వేయటం గురించి విస్తృతంగా ప్రచారం చేయటానికి ఈపథకం ఉద్దేశించబడింది. 1958–59 సంవత్సరపు ఉత్తర భాగంలో ఈపథకం అమలు పరచబడింది. వివిధ కేంద్రాలలో ఈపని కొనసాగింపబడుతున్నది. ఆంధ్రలో 28 మంది కాంగార్లు, తెలంగాణాలో 12 మంది కాంగార్లు వివిధ కేంద్రాలలో పని చేస్తున్నారు. 1959–60 సంవత్సరంలో ఈ పథకాన్ని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.30 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకంవల్ల ఈజిల్లాలో చెరకు పండించేవారు కూడ లాభం పొందుతారు.

## జీడి తోటల అభివృద్ధి

రాజ్యంలో విస్తారంగా ఉన్న బంజరు భూమిని జీడితోటల క్రిందకు తీసుకొని వచ్చే ఉద్దేశంతో క్రొత్తగా ఎన్నిక చేయబడిన ప్రాంతాలలో నాటేటందుకు 15,000 పౌన్ల మంచి రకం విత్తనాలను సేకరించటానికి ప్రతిపాదింపబడింది. తగిన ప్రాంతాలను ఎన్నికచేసి, జీడితోటలను విస్తరింప చేసే నిమిత్తం శ్రీకాకుళం, తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాలలోని ప్రదేశాలను సర్వేచేయటానికి కూడ ప్రతిపాదింప బడింది. జీడి తోటల క్రిందకు అదనంగా భూమిని తీసికొని వచ్చేటందుకు వీలు కల్పించే నిమిత్తం ఈ పథకం క్రింద రైతులకు ఎకరానికి రు. 100 లు చొప్పున అప్పు మంజూరు చేయబడుతుంది.

ఒక క్యాషునట్ డెవలప్‌మెంటు ఆఫీసరును, 4 గురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తాను. 5 మంది జవానులను నియమించటం ద్వారా ఈ పథకం 1958-59 లో అమలు జరుప బడింది. 3,000 ఎకరాల భూమిని జీడి తోటల క్రిందకు తీసికొని రావటానికి గాను అప్పులు ఇవ్వబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించటానికి, 6,000 ఎకరాల భూమిని జీడి తోటల క్రిందకు తీసుకొని రావటానికిగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.12 లక్ష మొత్తం జిల్లాలో కలిగే అదనపు

అవసరాల నిమిత్తం ప్రధాన కార్యస్థానంలో ప్రత్యేకించి పెట్టబడింది. సిబ్బంది ఖర్చు మొదలగు వాటికోసం రు. 0.11 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 0.06 లక్ష ఈ జిల్లాలో 60 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తెచ్చే నిమిత్తం అప్పులివ్వటానికిగాను ప్రత్యేకింపబడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో నూనె విత్తనాల 'ఉత్పత్తి, అభివృద్ధికి సంబంధించిన పథకం.

రాజేంద్రనగరులో ఉన్న ఆయిలు సీడ్సు స్పెషలిస్టు పర్యవేక్షణక్రింద యీ పథకం 1958-59 లో ఆంధ్రప్రాంతపు 9 జిల్లాలలోను, తెలంగాణా ప్రాంతపు 5 జిల్లాలలోను అమలు పరచ బడింది. మేలురకం విత్తనాలను ఉపయోగించేటందుకు, చాలినంత ఎరువును వాడేందుకు, ఒకపంటకు మరోపంటకు మధ్య సరియైన వేరొక పంటను పండించేటందుకు సస్యరక్షణ పద్ధతులను అవలంబించేటందుకు తీవ్రప్రచారం చేయటంద్వారా నూనె విత్తనాల ఉత్పత్తిని పెంచటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. ఈ క్రింది సిబ్బందిని కూడ 1958-59లో నియమించడం జరిగింది.

| | |
|---|---|
| అసిస్టెంటు ఆయిలుసీడ్సు డెవలప్‌మెంట్ ఆఫీసర్లు. | 2 |
| అసిస్టెంట్లు. | 11 |
| ఫీల్డుమెన్‌లు. | 22 |
| అప్పరు డివిజను గుమాస్తాలు. | 4 |
| లోయరు డివిజను గుమాస్తాలు. | 16 |
| టైపిస్టులు. | 3 |
| జీపు డ్రయివర్లు. | 2 |
| జవానులు. | 17 |
| వాచ్‌మెన్‌లు. | 2 |

1959-60లో యీ పథకాన్ని కొనసాగించటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 2,71 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ పథకం క్రింద లాభం చేకూరే 14 జిల్లాలలో యీ జిల్లాకూడ ఒకటి.

## నూనె విత్తనాల విస్తరణ పథకం (ఆంధ్రప్రదేశ్)

"నూనె విత్తనాల అభివృద్ధి పథకం"లో చెప్పబడిన రీతిగా నూనె విత్తనాల ఉత్పత్తిని పెంచేటందుకు ప్రయత్నించటమే యీ పథకం ఉద్దేశ్యం. ఇది 1958-59లో 6 కేంద్రాలలో ప్రారంభించ బడింది. ఇందులో ఆంధ్ర ప్రాంతంలో మూడు కేంద్రాలు కడప, చిత్తూరు, గుంటూరులలోను, తెలంగాణ ప్రాంతంలో మూడు కేంద్రాలు మహబూబ్‌నగరు, కరీంనగర్, వరంగల్లులలోను ఉన్నాయి. ఈ 6 కేంద్రాల్లోను యీ పథకాన్ని కొనసాగించటం కోసం 1959-60 ప్రణాళికలో రు.4.50లక్షల మొత్తం కేటాయించబడింది.

## ఫీల్డు మెనులకు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ

మేలు రకం వ్యవసాయ విధానాలను గురించి ప్రదర్శనలు ఏర్పాటు చేయటానికి, తీవ్రప్రచారం చేయటానికిగాను వ్యవసాయ శాఖలో నియమించే నిమిత్తం ఆ ఫీల్డుమెన్‌లకు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు ఆరునెలలపాటు ఉత్తమ వ్యవసాయ విధానాలలో శిక్షణ ఇచ్చేటందుకు ఈపథకం ఉద్దేశించ బడింది.రెండవ ప్రణాళికయొక్క మొదటి రెండుసంవత్సరాల కాలంలో ఆంధ్ర ప్రాంతంలోని క్రింది కేంద్రాలలో 197 మంది డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలకు శిక్షణ ఇవ్వబడింది.

1. చెరకు పరిశోధన కేంద్రం, అనకాపల్లి.
2. వ్యవసాయ పరిశోధన కేంద్రం, సామర్లకోట.
3. వ్యవసాయ పరిశోధన కేంద్రం, మార్టేరు.
4. కళాశాల క్షేత్రం, బాపట్ల.
5. వ్యవసాయ ః రిశోధన కేంద్రం, నంద్యాల.

ఆంధ్ర ప్రాంతంలోని పై 5 కేంద్రాలలోను, తెలంగాణా ప్రాంతంలోని క్రింది మూడు కేంద్రాలలోను 1958-59 సంవత్సరంలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలనుండి 178 మంది ఫీల్డుమెన్లు, 178 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు.

1. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, రాజేంద్రనగరు.
2. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, వరంగల్లు.
3. ప్రభుత్వ ప్రయోగ కేంద్రం. రుద్రూరు,

శిక్షణ కార్యక్రమం ఈ సంవత్సరములో కూడ కొనసాగించ బడుతుంది. 178 ఫీల్డుమనులు, 178 డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలు చేర్చుకోబడతారు. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0-81 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని ప్రభుత్వ ప్రధాన క్షేత్రంలో 26 మంది ఫీల్డుమనులు, 26 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణఇచ్చే నిమిత్తం పై మొత్తంలో రు. 0 12 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది.

## ఆయిలు ఇంజనులను నడుపుటలో రైతులకు శిక్షణ.

ఆయిలు ఇంజనులను సరిగా నడుపుటలోను నిర్వహించుటలోను రైతులకు శిక్షణ ఇచ్చే ఉద్దేశంతో ఈ పథకం 1957-58 సం లో అమలు జరుపబడింది. 1957-58, 1958-59 సంవత్సరాల కాలంలో 579 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడింది. రు. 0. 18 లక్ష వ్యయంతో యీ సంవత్సరంలో 461 మంది రైతులకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని రైతులు కూడ ఈ పథకం వల్ల లాభం పొందుతారు.

## జిల్లా సర్వీసు స్టేషన్ల ఏర్పాటు

రైతులవద్దను, వ్యవసాయశాఖ వద్దను ఉన్న వ్యవసాయక పరికరాలను మరమ్మతుచేయటంలో వారికి తోడ్పటానికి, తద్వారా జిల్లాల్లో ఉపయోగంలోలేని యంత్రాలను ఉపయోగంలోనికి తెచ్చే ఉద్దేశంతో జిల్లాలలో జిల్లా సర్వీసు స్టేషన్లను ఏర్పాటుచేయటానికి ప్రతిపాదింప బడింది. దీనినిపురస్కరించుకొని 1957-58 లో కాకినాడలో ఒకస్టేషను, 1958-59 లో చిత్తూరు, నెల్లూరు, నిజామాబాదు, వరంగల్లులలో నాలుగుస్టేషన్లు మొత్తం 5 స్టేషన్లు ఏర్పాటుచేయబడినాయి. రు. 1.47 లక్షల వ్యయంతో యీ స్టేషన్లు వర్తమాన సంవత్సరములో కొనసాగించబడతాయి. పై కేటాయింపులో రు. 0.28 లక్ష వరంగల్లులోని కేంద్రంకోసం ప్రత్యేకించ బడింది.

## ఆంధ్ర ప్రదేశ్‌లో భూసార పరిశీలన (సామాన్య రసాయనిక ఎరువులతో)

రెండవ ప్రణాళిక పూర్తిఅయ్యేనాటికి నీటిపారుదల ప్రాజెక్టులలో కొన్నిటి నిర్మాణం పూర్తి అవుతుంది. ఆ విధంగా పూర్తిఅయిన ప్రాజెక్టువల్ల లభించే నీటిపారుదల సౌకర్యాలను పూర్తిగా వినియోగించు కోవడానికిగాను ముందుగానే రాజ్యంలో ఉన్న పలురకాల భూములకు ఎంతనీరు కావలసిందీ, ఎంతెంత ఎరువు వెయ్యాల్సిందీ వివరాలు సేకరించి, వాటికిసంబంధించిన సలహాలను రైతులకు సకాలంలో అందచేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను బాపట్లలో ఉన్న అసిస్టెంటు అగ్రికల్చరల్ కెమిస్టు పర్యవేక్షణక్రింద రాజ్యంలోని వివిధ కేంద్రాలలో, పండే ముఖ్యమయిన పంటలను గురించి, వాడే ఎరువులను గురించి భూసార పరిశీలనలు జరపడానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరంలో ఈ పథకం 6 జిల్లాలలో కొనసాగింప బడుతుంది. అందుకుగాను రు. 0.96 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని ములుగు, పాకాలలలో ఉన్న కేంద్రాలలో పరిశీలనలు జరిపే నిమిత్తం పై మొత్తంలో రు. 0.186 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది.

## మార్కెటింగు సమాచారం అభివృద్ధి

వర్తకులు, ఉత్పత్తిదార్ల ఉపయోగార్థం మార్కెటింగు సమాచారాన్ని అంద చేసే ప్రస్తుత పద్ధతిని అభివృద్ధిచేసే ఉద్దేశంతో ధరలను గురించి, వ్యవసాయ సరకులు, పాడి పదార్థాల రవాణాగురించి సరియైన వివరాలను సేకరించి, ఆ సమాచారం అందరికి అందేటట్లు చేయటమే యీ పథకంయొక్క లక్ష్యం. విజయవాడ, వరంగల్లు కేంద్రాలలో 1957–58 లో యిద్దరు మార్కెటింగు అసిస్టెంట్లు, యిద్దరు లోయరుడివిజను గుమాస్తాలు, ఇద్దరు జవానులు నియమించ బడినారు. ఈ రెండుకేంద్రాలలో నియమించబడిన సిబ్బందినికొనసాగించేటందుకు గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.34 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## కాజిపేటలో జి. డబ్ల్యు. ఎ పొగాకు పరిశోధన కేంద్రం

శాస్త్రీయ పద్ధతులలో గుంటూరు వైట్ ఆష్ పొగాకు నారుమళ్ళను వేసే టందుకు, వివిధరకాల ఎరువులను ఎంతెంత పరిమాణంలో వాడాలో నిర్ణయించ టానికిగాను 1958-59 సం. లో కాజిపేటలో ఒక పరిశోధన కేంద్రం ఏర్పాటు చేయబడింది. ఈ మళ్ళలో పెంచబడే నారు వ్యవసాయదారులకు పంపిణీచేయబడు తుంది. ఒక బొటానికల్ అసిస్టెంటు, గుమాస్తా పనికూడచేసేఒక టైపిస్టు, ఒక క్యూరరు, ఒక ఇంజను డ్రైవరు, ఒక జవాను యీ కేంద్రంలో పనిచేయు టకుగాను గత సంవత్సరం నియమించబడినారు. ఈ కేంద్రాన్ని, సిబ్బందిని కొనసాగించటంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష మొత్తం కేటాయించబడింది.

## వరంగల్లు ఫారం సూపరింటెండెంటు పదవిని రెండవతరగతి గెజిటడ్ స్థాయికిమార్చటం

వరంగల్లులోని ప్రధాన ప్రయోగక్షేత్రంలో పరిశోధన కార్యక్రమాన్ని విస్తృతం చేయటం మూలంగాను, పరిశోధనకు సంబంధించిన వివిధ ఉపవిభాగా లను ఏర్పాటు చేయటంమూలంగాను ఫారం సూపరింటెండెంటు చేయవలసినపని, నిర్వహించవలసిన బాధ్యతలు ఎక్కువయిన కారణంగా 1957-58 లో ఫారం సూపరింటెండెంటు పదవిని నాన్ గెజిటెడ్ నుండి గెజిటెడ్ పదవికి మార్చడం జరిగింది. రు. 0.05 లక్ష వ్యయంతో ఈ సంవత్సరంలో యీ పదవి కొన సాగించ బడుతుంది.

## పరిశోధనా కేంద్రాలకు కావలసిన అదనపు పరికరాలు

తెలంగాణా ప్రాంతంలోని వ్యవసాయ పరిశోధన కేంద్రాలలోఉన్న లేబ రేటరీలలో చాలావాటికి అధునిక పరికరాలు కాని, అవసరమైన రసాయనిక పదార్థాలు కాని లేవు. ఇందువల్ల ఈ పథకం క్రింద పైలేబరేటరీలకుఅవసరమైన పరిక రాలను రసాయనిక పదార్థాలను ఖరీదు చేయడానికి ప్రతిపాదింప బడింది. 1957-58, 1958-59 సంవత్సరాలలో రసాయనిక పదార్థాలు మొదలైన వాటిని సరఫరా

చేయటం కోసం రు. 0.31 లక్ష మొత్తం ఖర్చు చేయబడింది. రాజేంద్రనగరు, రుద్రూరు, వరంగల్లు, డిండిలలో ఉన్న పరిశోధనా కేంద్రాలలో నెలకొల్పబడిన లేబరేటరీలకు పరికరాలను, రసాయనిక పదార్థాలనుకొని, సరఫరా చేయటానికి గాను యీ సంవత్సరంలో రు. 0. 15 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు కావలసిన అదనపు వసతులు.

ఇతర ప్రాంతాలలో నున్న వ్యవసాయ క్షేత్రాలతో పోల్చి చూస్తే తెలంగాణా ప్రాంతంలోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అంతగా అభివృద్ధి చెందలేదు. ఇందువల్ల రాజేంద్ర నగరు, రుద్రూరు, డిండి, వరంగల్లులలో నున్న క్షేత్రాలకు అదనపు పరికరాలను సమకూర్చటానికి, అదనపు భవనాలు నిర్మించటానికి ప్రతి పాదింప బడింది. 1957-58 లో రు. 0.565 లక్ష మొత్తం విలువచేసే అదనపు పరికరాలు కొంతవరకు ఈ క్షేత్రాలకు సమకూర్చ బడినాయి. సిమెంటు, ఉక్కు మొదలైనవి దొరకనందువల్ల భవనాల నిర్మాణం ప్రారంభించ బడలేదు. ఈ క్షేత్రాలకు పరికరాలను ఖరీదు చేయటానికి, భవనాలను నిర్మించటానికి గాను 1958-59లో రు. 2.13 లక్షల మొత్తం కేటాయించ బడింది. మరికొన్ని పరికరాలను కొనడానికి, భవనాలను నిర్మించడానికి గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1. 40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.51 లక్ష మొత్తం ఈ జిల్లాలోని రాజేంద్రనగరులో ఉన్న క్షేత్రం కోసం ప్రత్యేకించ బడింది.

## వరంగల్లులో పంటలకు అనుకూలించే గాలిపాటు పరిశీలన పథకం

జొన్న, వేరుశెనగ పంటలకు సంబంధించిన గాలిపాటు పరిశీలన జరప టానికి, యీ పంటలకు తగిలే చీడలు, తెగుళ్ళనుగురించి పరిశీలించటానికిగాను రాజేంద్రనగరులో ఉన్నటువంటి కేంద్రం నమూనాలో పంటకు అనుకూలించే గాలి పాటుపరిశీలన కేంద్రం 1957-58 లో వరంగల్లులో ఏర్పాటుచేయిబడింది. ఈ సంవత్సరంలో దీనిని కొనసాగించేటందుకు గాను ప్రణాళికలో రు. 0.06 లక్ష మొత్తం కేటాయించ-బడింది.

## నరసంపేటలో పురుగుకొట్టుడును (గాల్‌ఫ్లై) నిరోధించగల వరిధాన్యపు రకాలను ఉత్పత్తిచేయటం

వరికి "గాల్‌ఫ్లై" చీడతగిలినప్పుడు అదిమొక్కలోపలకూడ ప్రవేశిస్తుంది. క్రిమిసంహారక మందులను పైపైన ఉపయోగించటంవలన ప్రయోజనం ఉండదు. ఇందువల్ల "గాల్‌ఫ్లై" ని నిరోధించగల వరిధాన్యపు రకాలను రూపొందించటం అవసరం. ఈ పథకాన్ని నిరుడు సంవత్సరమే అమలుపరచ ప్రతిపాదింప బడినప్పటికీ, మంజూరు మాత్రం యివ్వబడలేదు. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని అమలుపరచుటకుగాను ప్రణాళికలో రు 0.45 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఆంధ్ర ప్రదేశ్‌లో నలగర్ కమిటీవారి సిఫారసులను అమలు జరపటం కోసం లాంఛన ప్రాయమైన కేటాయింపు

1957-58 లో భారత ప్రభుత్వం వారు వ్యవసాయ పరిపాలనా సంఘాన్ని (అగ్రికల్చరల్ అడ్మినిస్ట్రేటివ్ కమిటీ) ఏర్పాటు చేశారు. రాజ్యాలలో నెలకొల్ప డానికి అనుకూలంగా ఉండే నమూనా వ్యవసాయ సంఘాల్ని గురించి, వ్యవసాయ శాఖలోని ప్రతి వర్గానికీ చెందిన సిబ్బంది తమకు అప్పగించ బడిన కార్యక్రమా లను బాధ్యతతో నిర్వహించేటందుకు వీలుగా అన్ని స్థాయీలలోను వ్యవసాయ శాఖాధికార్లకు అవసరమైన అధికారాలను అప్పగించే పద్ధతులను గురించి రాజ్యాల పరిశీలనార్థం సిఫారసులను చేయడమే యీసంఘం వారి కర్తవ్యం. సంఘంవారి నివేదిక అందచేయబడింది. సంఘం చేసిన సిఫారసులను పరిశీలించి, అమలు పరచటం కోసం 1959-60 ప్రణాళికలో లాంఛన ప్రాయంగా రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. సవివర మయిన ప్రతిపాదనలు ఇంకా రూపొందించ బడలేదు.

## వ్యవసాయోత్పత్తికి సంబంధించిన సూచీలను తయారుచేయటం

రాజ్యంలో వ్యవసాయ ఆదాయానికి సంబంధించిన వివిధ సూచికలను సంకలనం చేయటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. వ్యవసాయోత్పత్తికి, పంట ధరలకు, వ్యవసాయ వేతనాలకు సంబంధించిన సూచికలు కూడ ఇందులో చేరు తాయి. 1957-58 లో ఈ పథకం అమలు జరుప బడింది. 1958-59 లో కొనసాగించ బడింది. ఈ సంవత్సరంలో కూడ ఈ పథకాన్ని కొనసాగించే నిమిత్తం రు. 0.06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## పట్వారీల పనిని పర్యవేక్షించటం.

భూమి విస్తీర్ణం మొదలైన వాటిని పట్వారీలు, కరణాలు సిద్ధం చేస్తారు. వీరు వివరాలను అందచేసే విషయంలో తగినంత పర్య వేక్షణ జరిపించడం, భూముల విషయంలో చేయవలసిన సర్దుబాటు వివరాలను తయారు చేయడం, రాజ్యంలో ముఖ్యమైన పంటలు జిల్లా స్థాయిలో ఎన్నెన్ని ఎకరాల భూమిలో పండించబడుతున్న వన్న విషయాలకు సంబంధించిన సరియైన గణాంక వివరాలను తయారు చేయడం - ఇవి ఈ పథకం యొక్క లక్ష్యాలు. అవసరమయిన సిబ్బందిని నియమించడం ద్వారా రాజ్యంలోని అన్ని జిల్లాలలోను ఈ పథకాన్ని అమలు పరచడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0. 35 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందుకు సంబంధిం చిన పని అంతా రెవిన్యూ ఇనస్పెక్టర్లు నిర్వహిస్తారు. ఈ పథకం క్రింద నియ మించ బడే తహసీల్దార్లు, ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్లు పై ఉద్యోగులు చేసే పనిని పర్యవేక్షిస్తారు. అర్థగణాంక శాఖవారు వివరాలను వర్గీకరిస్తారు. ఈ పథకాన్ని రూపొందించడం, అమలు జరపటాన్ని పర్యవేక్షించటం కూడ ఈ శాఖవారే నిర్వహిస్తారు.

# చిన్న తరహా నీటి పారుదల పనులు

### గండ్లుపడ్డ చెరువులు (పి. డబ్ల్యు. డి.)

### (బకాయి పనులు, క్రొత్త పథకాలు)

తెలంగాణా ప్రాంతంలో 61,176 ఎకరాలఆయకట్టు గల దాదాపు 707 గండ్లు పడ్డ చెరువుల మరమ్మతు కోసం ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి

గాను రూ. 39. 25 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 4.90 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఈ మొత్తంతో 4,368 ఎకరాల ఆయకట్టుగల 76 చెరువులు మరమ్మత్తు చేయబడతాయి.

## ఆయిలు ఇంజన్ల స్థాపన

ఈ పథకం క్రింద ఆయిలు ఇంజన్లు, పంపుసెట్లు కొనుక్కోనేటందుకు గాను తక్కావి ఋణాలు ఇవ్వబడతాయి, ప్రతి రైతుకు రు 2, 000 లకు మించకుండా ఋణాలు ఇవ్వబడతాయి. ఈ ఋణం తేలిక వాయిదాల పద్ధతిపై వసూలు చేయబడుతుంది. 1959-60 లో 250 ఆయిలు ఇంజన్లను పంపకం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 5 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.80 లక్ష మొత్తం ఈ జిల్లాలో 60 ఆయిలు ఇంజన్ల పంపకం నిమిత్తం ప్రత్యేకించబడింది.

## క్రొత్తబావుల త్రవ్వకం, పాతబావుల మరమ్మతు

ఈ పథకం క్రింద రైతులకు క్రొత్తబావులు త్రవ్వకోవడానికి రు. 2500. లకు మించకుండాను, పాత బావులను మరమ్మత్తు చేసుకోవడానికి రు. 750 లకు మించకుండాను ఋణాలు ఇవ్వబడతాయి. రెండు దఫాలలో ఋణం మొత్తం చెల్లింపు చేయబడుతుంది. పని మొదలు పెట్టినపుడు ఋణంలో కొంత భాగం ఇవ్వబడుతుంది. పని చాలవరకు కొనసాగి, సకాలంలో పని ముగుస్తుందని అధి కార్లు అభిప్రాయ పడినపుడు మిగతా ఋణం చెల్లించ బడుతుంది. తెలంగాణా ప్రాంతంలో 214 క్రొత్త బావులను త్రవ్వటానికి, 142 పాత బావులకు మరమ్మత్తుకు గాను ఋణాలు మంజూరు చేయటం కోసం 1959-60 ప్రణాళికలో రు. 0.73 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.67 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఈ మొత్తంతో 23 క్రొత్త బావులు త్రవ్వబడ తాయి. 20 పాత బావులు మరమ్మత్తు చేయబడతాయి.

## బోరింగు నూతులు

ప్రస్తుతమున్న బావుల నీటి సరఫరాను అధికం చేయుటకు గాను వాటికి బోరింగు వేసే నిమిత్తం ఈ పథకం క్రింద నూతులలో బోరింగు వేయు

టానికి అవసరమయ్యే యంత్రి పరికరాలను కొనటానికి, సిబ్బందిని నియమించ టానికి ప్రతిపాదింప బడింది. 136 బావులలో బోరింగు వేసే నిమిత్తం 1959-60 లో రు. 0.19 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.05 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ మొత్తంతో ఈ జిల్లా లోని 34 బావులలో బోరింగు వేయబడుతుంది.

## క్రొత్తబావుల సబ్సిడీ పథకం

తెలంగాణా ప్రాంతంలో రైతులు బావులు త్రవ్వుకొనేటందుకు గాను ప్రతిబావికి రు 750 ల చొప్పున సబ్సిడీ ఇచ్చే నిమిత్తం 1959_60 ప్రణాళికలో రు. 9. 375 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ సంవత్సరంలో 1,250 బావులు త్రవ్వబడతాయని ఆశించ బడుతున్నది. పై మొత్తంలో రు 1.125 లక్షల మొత్తం ఈ జిల్లాలో 150 క్రొత్తబావుల త్రవ్వకం నిమిత్తం ప్రత్యేకించ బడింది.

# పశుగణాభివృద్ధి

## పశువైద్య శాఖ ప్రధాన కార్యాలయానికి, జిల్లా కార్యాలయాలకు అదనపు సిబ్బంది నియామకం

పశువైద్య శాఖ కార్యక్రమాలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. ఎక్కువయి పోతున్న పనిని నిర్వహించేటందుకు వీలుగా 1957_58 లో అదనపు సిబ్బంది నియమించ బడింది. ఈ సంవత్సరంలో ఈ సిబ్బంది కొనసాగించ బడుతుంది ఇంతేకాక ప్రభుత్వ పశు క్షేత్రాలలోను, ప్రధాన కార్యాలయంలోను, జిల్లా కార్యాలయాలలోను ఇంకా కొంత అదనపు సిబ్బంది నియమించ బడుతుంది. ఇందుకుగాను ఈ జిల్లాకు 1959-60 సంవత్సరానికి 0 06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## స్టేషనరీ పశువైద్య శాలల స్థాపన

జబ్బుతో బాధ పడుతున్న పశువులకు వైద్య సహాయం అందుబాటులో ఉంచడానికి, వాటికి క్రమ పద్ధతిలో చికిత్స చేయడానికి గను ఈ పథకం క్రింద

తెలంగాణ ప్రాంతంలోని ముఖ్యమయిన తాలుకా కేంద్రాలలో స్టేషనరీ పశు వైద్య శాలలను ఏర్పాటు చేసేటందుకు ప్రతిపాదింప బడింది. పశువైద్య సౌకర్యాలు అవసరమయి ఉండి, ప్రజలు లేక స్థానిక పంచాయతీల నుండి విరాళాలు లభించే స్థలాలలో ఈ వైద్యశాలలు ఏర్పాటు చేయబడతాయి. ప్రతి వైద్యశాల కూడ ఒక వెటరినరీ అసిస్టెంటు సర్జను అధ్వర్యంలో పని చేస్తుంది, 1959-60 లో తెలంగాణా ప్రాంతంలో ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశువైద్యశాలలను కొనసాగించడమే కాక మరో నాలుగు వైద్యశాలలు ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింప బడింది ఇందుకు గాను రు. 0.93 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.06 లక్ష మొత్తం ఈ జిల్లాలో ఒక క్రొత్త వైద్యశాలనుస్థాపించటానికి, ఒక పాత వైద్యశాలనుకొనసాగించటానికిగాను ప్రత్యేకించ బడింది.

## చిన్న తరహా పశువైద్యశాలలు

అంటువ్యాధులు వ్యాపించకుండా నిరోధించడానికి, జబ్బుపడిన పశువులకు వైద్యసహాయం అందజేయడానికిగాను తెలంగాణా ప్రాంతంలో 1959–60 లో 10 చిన్నతరహా పశువైద్యశాలలను ఏర్పాటు చేసేటందుకు, ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశువైద్యశాలలను కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను రూ. 1.78 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.18 లక్ష మొత్తంతో ఈ జిల్లాలో మరో 2 చిన్న తరహా పశువైద్యశాలలను ఏర్పాటు చేయటానికి, రెండు పాత వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది.

## జిల్లా పశువైద్య శాఖాధికారులకు జీపుల సరఫరా

జిల్లా పశువైద్యశాఖాధికార్లు తమక్రింద పనిచేసే ఉద్యోగులపనిని తనిఖీ చేసి, వారిని అప్రమత్తతతో ఉంచేటందుకుగాను విస్తృతంగా పర్యటనలు జరపటం అవసరం. ఇందువల్ల తరుచుగాను, ఆకస్మికంగాను ఉద్యోగులపనిని తనఖీ చేయుటకు వీలుకల్పించే నిమిత్తం వీరికి యిదివరకే సరఫరా చేయబడిన జీపులను 1959- 60 లో రూ. 0.45 లక్ష వ్యయంతో నిర్వహించుటకు ప్రతిపాదింప బడింది. ఇందులో రూ 0.0562 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింధి.

## స్టాక్ మెన్‌లకు శిక్షణ

పశువైద్య శాస్త్రం, పశుగణాభివృద్ధి విషయాలలో ప్రాథమిక విజ్ఞానాన్ని గురించి అభ్యర్థులకు ఈ పథకం క్రింద ఆరు నెలలపాటు శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుమూలంగా వారు అంటువ్యాధులు ప్రబలకుండా నిరోధక చర్యలు తీసికోవడానికి, పశుగణాభివృద్ధి పథకాలకు సంబంధించి ప్రాథమికమైన పనులను నిర్వహించడానికి వీలుచేకూరుతుంది. శిక్షణ పూర్తిఅయిన తరువాత ఈ అభ్యర్థులు కాంపౌండర్లుగా నియమించ బడతారు. నారాయణగూడాలోని పశువైద్యశాలలో 170 మంది విద్యార్థులు శిక్షణ నిమిత్తం 1957–59 లలో చేర్చుకోబడినారు. తెలంగాణాలో మరో 260 మంది అభ్యర్థులకు స్టాక్ మెన్‌లుగా శిక్షణ ఇవ్వడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.38 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.08 లక్ష మొత్తం 50 మంది అభ్యర్థుల శిక్షణకుగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## కీలక గ్రామపథకం

తెలంగాణా ప్రాంతంలో ఇంతకుముందు ఏర్పాటుచేయబడిన కీలక గ్రామ కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరోరెండు కేంద్రాలను ఏర్పాటు చేయటానికిగాను 1959–60 ప్రణాళికలో రూ. 3.65 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 0·366 లక్ష మొత్తం ఈ జిల్లాలోని ఒక కీలక గ్రామ కేంద్రం కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించ బడింది.

## జిల్లా, రాజ్య పశుప్రదర్శనలు

1959–60లో ఒక జిల్లాపశుప్రదర్శన యీజిల్లాలో ఏర్పాటుచేయబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రూ. 0.10 లక్ష కేటాయించ బడింది.

## రిండరుపెస్టు వ్యాధినిర్మూలన పథకం

ఈ జిల్లాలో అరక్షితంగా వుండిపోయిన పశువులకు టీకాలు వేయడంద్వారా రక్షణ కల్పించేటందుకుగాను యీఉద్యమాన్ని కొనసాగించే నిమిత్తం రూ. 0.167 లక్ష కేటాయించబడింది.

### ఆబోతుల పంపకం

ఈ పథకం క్రింద, 1959–60 లో రూ. 0.06 లక్ష అంచనా వ్యయంతో ఈ జిల్లాలో మాల్వి, ఒంగోలు లేక ముర్రా రకానికి చెందిన 6 ఆబోతులను పంచడానికి ప్రతిపాదింప బడింది.

### ప్రస్తుతమున్న పశువైద్య సంస్థలను పునర్వ్యవస్థీకరించటం

సత్వరంగాను, సరిగాను వ్యాధినిర్ణయంచేసి సకాలంలో పశువులకు వైద్య చికిత్సను కలిగించే సౌకర్యాలను అందుబాటులో ఉంచేటందుకు గాను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయటంద్వారా తెలంగాణాలోని వైద్యసంస్థలను పునర్వ్యవస్థీకరించటానికి ప్రతిపాదింపబడింది. ఈ ఉద్దేశంలోనే వరంగల్లులో ఒక క్లినికల్ లేబరేటరీని ఏర్పాటుచేయటం కోసం 1959–60 ప్రణాళికలో 0.24 లక్ష మొత్తం కేటాయించ బడింది,

### పశు క్షేత్రాలకు, పశువైద్యశాలలకు భవనాలను నిర్మించటం

ఈజిల్లాలో పశువైద్యశాలను ఏర్పాటుచేసే టందుకుగాను స్థలం ఉచితంగా లభ్యమయ్యే తావులో శాశ్వతంగా ఒక భవనం నిర్మించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.23 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### జిల్లా కోళ్ళపెంపక క్షేత్రాలను ఏర్పాటు చేయటం

విదేశి కోళ్ళకున్న హెచ్చుగిరాకీ దృష్ట్యా రు. 0.50 లక్ష వ్యయంతో 1959–60 లో ఒక కోళ్ళ పెంపక క్షేత్రాన్ని యీ జిల్లాలో ఏర్పాటు చేయుటకు ప్రతిపాదింప బడింది.

## పాడిపరిశ్రమ, పాల సరఫరా

### పట్టణ పాలసరఫరా పథకం

వరంగల్లు పట్టణానికి చుట్టుపట్లఉన్న 20 పాలసరఫరా సంఘాలను విలీనం చేయటంద్వారా ఆంధ్రలో ఉన్నటువంటి పాలసరఫరా సంఘాల పద్ధతిలో ఈ పథకం క్రింద వరంగల్లులో ఒక పాలసరఫరా యూనియన్ను ఏర్పాటుచేయటానికి

ప్రతిపాదింప బడింది. 5 ఎకరాల క్షేత్రంలో ఒక పాడికేంద్రంకూడ ఏర్పాటు చేయబడుతుంది. "ప్రోసెసింగు", "కోల్డుస్టోరేజి" సౌకర్యాలుకూడ ఏర్పాటు చేయబడతాయి. ఈపథకాన్ని పూర్తిగా అమలుపరచిన తేదీలగాయతు ఒక సంవత్సరం లోపున యీ సంఘం రోజుకు 12,000 పౌన్ల పాలను సరఫరాచేయచేయగల స్థితిలో ఉంటుందని ఆశించబడుతున్నది. ఈ పథకంయొక్క మొదటిదశను అమలు పరచటం కోసం 1959-60 ప్రణాళికలో రు. 1 67 లక్షల మొత్తం కేటాయించ బడింది.

# అడవులు

## ప్రాంతీయ డివిజన్ల ఏర్పాటు, అదనపు సిబ్బంది నియామకం

భూసార రక్షణ కార్యక్రమాన్ని, భూమికోరివేతను అరికట్టే పనులను, అడవులను పెంచే కార్యక్రమాన్ని, అడవులలో మొక్కలను నాటే కార్యక్రమాన్ని స్వాధీనంచేసుకోబడిన పూర్వపు ఎస్టేటు ఆడవులకు సంబంధించి సరిహద్దులను ఏర్పరచే పనిని నిర్వహించుటకు గాను 1956-57 లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించే నిమిత్తం రూ. 0.032 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## కలప అడవులలో కృత్రిమ పద్ధతిమీద చెట్ల పెంపకం

ముందుముందు అవసరం అయ్యే కలప అవసరాలను అందుకొనేటందుకై ఖమ్మం, వరంగల్లు, ఆదిలాబాదు, కరీంనగరు జిల్లాలలో కలపనిచ్చే చెట్లరకాలను పెంచేటందుకై పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పాటుచేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. పాతక్షేత్రాలను నిర్వహించటమేగాక క్రొత్తగా 70 ఎకరాల ప్రదేశంలో పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పాటుచేయటానికై 1959-60 ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.03 లక్ష కేటాయించ బడింది.

## అగ్గిపుల్లలకు పనికివచ్చే కలప తోటలు

స్థానిక పారిశ్రామిక సంస్థలకు, కుటీర పరిశ్రమలకు అగ్గిపుల్లలకు పనికి వచ్చే కలప అవసరం ఎక్కువయి పోతున్నందు వల్ల, ఈ అవసరాన్ని తీర్చటా

టానికై వరంగల్లు జిల్లాలో తగిన ప్రదేశాలలో ఈరకం కలప తోటలు వేయ బడుతున్నాయి. ఈ సంవత్సరంలో 50 ఎకరాల ప్రదేశంలో ఈ రకం కలప తోటలను వేయటానికి, పాత తోటలను నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకోసం ఈ సంవత్సరంలో రు. 0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## భవనాల నిర్మాణం

అటవీశాఖ కార్యాలయాలు చాలవరకు అద్దె భవనాల్లో ఏర్పాటుచేయబడి ఉన్నాయి. వీటికి భవనాలను నిర్మించటానికి, జిల్లా అటవీశాఖాధికార్లకు వసతి గృహాలను నిర్మించడానికి ఈ పథకం ఉద్దేశింప బడింది. ఇంతకుముందే చేకొన బడిన పనిని పూర్తిచేయటం కోసం 1959–60 ప్రణాళికలో ఈ జిల్లాకు రు. 1.20 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## వన్యమృగ స్థావరాల ఏర్పాటు, రక్షణకు సిబ్బంది

వన్యమృగ జాతుల సంరక్షణకు ఏర్పాటుచేయబడిన 4 వన్యమృగ స్థావ రాలను కొనసాగించటం కోసం 1959–60 ప్రణాళికలో రు. 0.56 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాకు రు. 0.03 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## రోడ్ల నిర్మాణం

ప్రభుత్వానికి ఆదాయం సమకూర్చే ఖరీదైన కలపను వినియోగంలోకి తేవటానికై యీ పథకంక్రింద రెండవ ప్రణాళికా కాలంలో అడవుల్లో రోడ్లను నిర్మించటానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలో నాలుగుమైళ్ళ రోడ్లను నిర్మించ టానికిగాను ఈ సంవత్సరంలో రు. 0.20 లక్ష కేటాయించబడింది.

## అడవులు పెంచేటందుకు "నర్సరీలు"

నల్లగొండ జిల్లాలో అడవులు పెంచటానికై ఉద్దేశించబడిన ప్రాంతాలకు మొక్కలను, చెట్ల మొదళ్ళను సరఫరాచేసే ఉద్దేశంతో 1958–59 లో ఒక "నర్సరీ" యూనిట్టు ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో వరంగల్లు

జిల్లాలో ఒక "నర్సరీ యూనిట్టు ఏర్పాటు చేయటానికై రు. 0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## అడవుల అభివృద్ధికి "నర్సరీలు"

రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద అడవులను పెంచటానికి, పునరుద్ధరించటానికి నిర్ణయించబడిన ప్రాంతాలకు కావలసిన మొక్కల సరఫరాకుగాను తెలంగాణా ప్రాంతంలోని వివిధకేంద్రాలలో "నర్సరీ యూనిట్లు" ఏర్పాటు చేయబడు తున్నాయి. 1959-60 లో యీ జిల్లాలో ఒక "నర్సరీ యూనిట్టు" ఏర్పాటు చేయుటకుగాను రు. 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది.

---

# భూసార రక్షణ

## కాంటూరు బండింగు (సొలోపు గట్లు వేయడం)

తెలంగాణా ప్రాంతంలో భూములు మిట్టపల్లాలతో కూడుకొని ఉండుట చేత భూసార రక్షణ అనేది చాలా తాలూకాలలో సమస్యగా పరిణమించింది. భూసార క్షీణతను అరికట్టడానికి, తద్వారా భూమిలో తేమను కాపాడడానికి పంట దిగుబడిని పెంచడానికిగాను సొలోపుగట్లు పోయడం, చదునుచేయడం, సొలోపుల వెంబడి దున్నడం, గట్లపై పైర్లు నాటడంవంటి భూసార రక్షణచర్యలు తీసుకో బడుతున్నాయి. మధ్యరకం, తేలికరకం భూముల్లో, అందులోను ముఖ్యంగా ఎర్రఇసుక భూముల్లో గట్లుపోసే కార్యక్రమం అమలు జరుపబడుతుంది అర గాణిఉండే ప్రాంతాలనుండే యీ ప్రాంతాలు ఎంపిక చేయబడతాయి. 1955-56 లో ఈ పథకం ప్రారంభించ బడింది. 1956-59 సంవత్సరాల కాలంలో 4,453 ఎకరాల్లో సొలోపుగట్లు వేయబడినాయి. ఈ పనులవల్ల లాభంపొందేవారి నుండి తగినట్టి ఒప్పందం కుదుర్చుకున్న తరువాతనే వ్యవసాయదార్ల పొలాల్లో ఈ పనులు నిర్వహించబడతాయి. తెలంగాణా ప్రాంతంలో 6,900 ఎకరాల భూమిలో సొలోపు గట్లువేయడానికి, అవసరమయిన అదనపు సిబ్బందిని నియ మించ డానికి, ప్రస్తుతమున్న సిబ్బందిని కొనసాగించడానికి గాను 1959-60లో రూ. 6.06 లక్షల మొత్తం కేటాయించబడింది.

# మత్స్య సంవర్ధన

## ఎంపికచేయబడిన చెరువులలో చేపలను అధికంగా ఉత్పత్తిచేయటం

ఈ పథకం క్రింద 5 మండలాలలో ఎంపికచేయబడిన చెరువులలో చేపల ఉత్పత్తిని పెంచటానికి ప్రతిపాదింప బడింది. నిజామాబాదు, మెదక్, వరంగల్లు, కరీంనగరు, మహబూబునగరు జిల్లాలు యీ 5 మండలాలుగా ఏర్పాటు చేయబడతాయి. ఒక్కొక్క మండలంలో 12 చెరువులుంటాయి. శాస్త్రీయపద్ధతుల్లో చేపలను పెంచేవిధానాన్ని అవలంబించటానికి, వాడకందార్లకు అమ్మకంచేయడం కోసం చేపలను ఉత్పత్తిచేయటానికిగాను ప్రత్యేక సిబ్బంది నియమించ బడింది. ఈ సంవత్సరంలో ఈ సిబ్బందిని కొనసాగించటంకోసం రు. 0.49 లక్ష మొత్తం (జిల్లాకు రు. 0.098 లక్ష చొప్పున 5 జిల్లాలకు) కేటాయింపబడింది. ఈ పథకం అమలు జరపటంవల్ల ప్రతి జిల్లాలోను అదనంగా 20,000 పౌన్ల చేపలను ఉత్పత్తి చేయటం జరుగుతుందని ఆశించబడింది.

## బెస్తల సహకార సంఘాలకు సహాయం

బెస్తలలో చాలమంది పేదవారు. తెలంగాణాప్రాంతములోని బెస్తల సహకార సంఘాలకు తగ్గింపు ధరలకు నైలాను వలలను సమకూర్చడమే ఈపథకం యొక్క ఆశయం. 40 వలలనుకొని, సక్రమముగా నిర్వహింపబడుతున్న బెస్తల సహకార సంఘాలకు పంపకంచేసే నిమిత్తం 1959—60 సం. లో రూ. 0.10 లక్ష మొత్తం కేటాయింపబడ్డింది. ఇందులో 4 వలలు ఈ జిల్లాలో పంపకం చేయ బడతాయి. ఈ వలల ఖరీదు బెస్తలనుండి 5 సంవత్సరాల కాలంలో, చేపలు పట్టని నెలలను మినహాయించి, తేలిక వాయిదాలలో వసూలుచేయబడుతుంది.

## మత్స్య క్షేత్రాలు

1959-60 లో రు. 1.30 లక్షల వ్యయంతో నాలుగు మత్స్య క్షేత్రాలను తెలంగాణాలో ఏర్పాటు చేయ టానికి ప్రతిపాదింప బడింది. ఇందులో ఒక మత్స్య క్షేత్రం యీ జిల్లాలో రు. 0.325 లక్ష వ్యయంతో ఏర్పాటు చేయబడుతుంది. చేప పిల్లలను పెంచి వివిధ చెరువులలోను, సాగరాలలోను

నిల్వ చేయటానికిగాను యీ మత్స్యక్షేత్రాలు ఉద్దేశించ బడినాయి. ప్రయోగ కార్యక్రమానికిగాను కావలసిన ఉపయోగకరమైన శాస్త్రీయ సమాచారాన్ని కూడ యివి అంద చేస్తాయి.

---

# సహకారోద్యమం, గిడ్డంగులు, మార్కెట్లు

## గ్రామీణ పరపతి సంఘాల వి స్తరణ.

ఆంధ్ర ప్రాంతంలో అమలులో ఉన్నపథకం పద్ధతిమీదనే ఈ పథకంకూడ రూపొందించబడింది. తెలంగాణాప్రాంతంలో ఉన్న గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించటం, పటిష్ఠం చేయటం, వి స్తరింపచేయటమే ఈ పథకంయొక్క ఉద్దేశం. సహకారశాఖ సిబ్బందిని పటిష్ఠం చేయటంద్వారాను, సెంట్రల్ బ్యాంకులు, పెద్దతరహా సంఘాలు అదనంగా నియమించే పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను ఈ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలుజరుపపడింది. 1959–60 సంవత్సరంలో ఇంతకుముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించటానికి, తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా 650 చిన్న తరహా సంఘాలను ఏర్పాటు చేయటానికి ప్రస్తుతమున్న 500 చిన్న తరహా సంఘాలను పటిష్ఠం చేయటానికి, నిర్వాహక సిబ్బంది ఖర్చు క్రింద ధన సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. రు. 300 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాల పరిమితిని రు. 30 లక్షల వరకు మధ్యకాలిక ఋణాల పరిమితిని పెంచటానికి కూడ ప్రతిపాదింప బడింది. అపెక్సు బ్యాంకులు కేంద్ర సహకార బ్యాంకులు అప్పు తీసికొనే స్తోమతను ఎక్కువ చేసుకోవటానికి, తద్వారా అవి అప్పులిచ్చే సౌకర్యాన్ని అధికం చేసుకోవటానికి వీలు కలిగించే నిమిత్తం వాటి వాటా మూలధనాల క్రింద ఇంకా ఎక్కువగా ప్రభుత్వం డబ్బును ఇవ్వడానికి ప్రతిపాదింప బడింది. ఇపుడున్న జిల్లాకార్యాలయాలన్నీ రెండు డిప్యూటీ రిజిష్ట్రార్ల సర్కిళ్లగా పునర్వ్యవస్థీకరించ బడతాయి. డిప్యూటీ రిజిష్ట్రార్లకు సహాయపడే నిమిత్తం సహకార సబ్ రిజిష్ట్రార్లు, సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లతో కూడిన అదనపు సిబ్బంది నియ

మించ బడుతుంది. కార్యనిర్వాహక శాఖనుండి ఆడిటు శాఖను విడతీసే పథకం కూడా యీ సంవత్సరంలోనే అమలు జరుప బడుతుంది.

ఈ కార్యక్రమం క్రింద ఈ జిల్లాలో కొత్తగా 130 చిన్న తరహా సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 55 చిన్న తరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాత సంఘాల్లో 23,800 మంది సభ్యులు, క్రొత్త సంఘాల్లో 3, 900 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 35 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 8 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు ఇవ్వబడతాయి.

పై కార్యక్రమం అమలు జరపటం కోసం ఈ జిల్లాకు రు. 1,43,006 లు కేటాయించ బడినాయి. ఆ దబ్బు క్రిందివిధంగా వినియోగించ బడుతుంది.

| | | రూపాయలు. |
|---|---|---|
| 1) | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీ | |
| | (ఏ) 1958_59 లో ప్రారంభించ బడిన సంఘాలకు. | 2,500 |
| | (బి) 1959_60 లో ఏర్పాటు చేయబడ బోయే క్రొత్త సంఘాలకు... | 6,700 |
| 2) | పెద్ద తరహా సంఘాలకు సహాయం. | 7,100 |
| 3) | సెంట్రలు బ్యాంకులకు సహాయం. | |
| | (ఎ) సెక్రటరీగా నియమించ బడిన కో-ఆపరేటివ్ సబ్- రిజిస్ట్రారు జీతభత్యాలకు. . | 3,300 |
| | (బి) ఎక్జిక్యూటివ్ ఆఫీసరుగా పనిచేయుటకు నియమించ బడిన సీనియరు ఇనస్పెక్టరు జీత భత్యాలకు. | 1,500 |
| | (సి) గత సంవత్సరాల్లో నియమించబడిన సూపరువైజరుల జీతభత్యాలకు... | 2,000 |

3. భూమి తనఖా బ్యాంకుల పని కోసం నియమించబడే సహకార సబ్ రిజిస్ట్రార్లు, జవానుల క్రింద ఖర్చు.

(ఏ) గత సంవత్సరాల్లో నియమించబడిన పాత సిబ్బంది క్రింద. 0.043

(బి) 1959-60 లో నియమించబడే క్రొత్త సిబ్బందిక్రింద. —

మొత్తం. 0.136

## సహకార మార్కెటింగు అభివృద్ధి

వ్యవసాయదార్లకు స్టోరేజి, గిడ్డంగి, ప్రాసెసింగు. మార్కెటింగు సౌకర్యాలను కలిగించటం ద్వారా సహకార మార్కెటింగును అభివృద్ధిచేయడం ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలోను ఇది అమలు జరుపబడింది. 39 మార్కెటింగు సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. అంతేకాక గిడ్డంగులు మొదలయిన వాటిని నిర్మించడానికి ఆర్థికసహాయం కూడ చేయబడింది.

ఈ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో మరో 10 సహకార మార్కెటింగు సంఘాలను ఏర్పాటుచేయడానికి. మార్కెటింగు సంఘాలవాటా మూలధనం క్రింద రు. 7 లక్షలను ఇవ్వడానికి ప్రతిపాదింపబడింది. ఇంతేకాక గిడ్డంగుల నిర్మాణానికి ఆర్థికసహాయం కూడ చేయబడుతుంది. సహకార మార్కెటింగు విషయాలకు సంబంధించి సీనియరు ఇనస్పెక్టర్లకు శిక్షణ కూడ ఇవ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమాలు ఈ జిల్లాలో అమలు జరుపబడతాయి.

1. క్రొత్తగా ఒక మార్కెటింగు సంఘం ఏర్పాటుచేయటం.
2. ఫలసాయంపై రు. 11.00 లక్షల వరకు ఋణాలు ఇవ్వడం.

3. కొత్తగా ఏర్పాటుచేయబడే మార్కెటింగు సంఘాలద్వారా ఒక గిడ్డంగి నిర్మాణం.

4. కొత్తగా ఏర్పాటు చేయబడే పెద్ద తరహా సంఘాలద్వారా నాలుగు గిడ్డంగుల నిర్మాణం.

5. ఒక ప్రాసెసింగు ప్లాంటును నెలకొల్పటం

పై కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ జిల్లాకు రు. 3.058 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు లక్షలలో. |
|---|---|---|
| 1. | మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనం క్రింద విరాళం. | 0.600 |
| 2. | ఇదివరలో ఏర్పాటుచేయబడిన మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బంది క్రింద సబ్సిడీ. | 0.042 |
| 3. | ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడే మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బంది క్రింద సబ్సిడీ. | 0.016 |
| 4 | పెద్ద రహా సంఘాలకు గిడ్డంగులు. | |
| | (ఎ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తి చేయటానికి | 0.300 |
| | (బి) 1959—60లో నిర్మించే గిడ్డంగులకు | 0.600 |
| 5. | మార్కెటింగు సంఘాలకు గిడ్డంగులు. | |
| | (ఏ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తి చేయటానికి | 0.250 |
| | (బి) ఈ సంవత్సరంలో నిర్మించే గిడ్డంగులకు. | 0.250 |

| | | |
|---|---|---|
| 6. | ప్రాసెసింగు ప్లాంటులు స్థాపించుటకు | 1.000 |
| | మొత్తం | 3.058 |

## పరిశోధన, పరిశీలన, గణాంకవివరాలు

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచేయబడుతుంది. సహకార శాఖ ద్వారా అమలు జరుపబడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన ప్రయోజనాన్ని, ఆ పథకాలను అమలు జరపడంలో తెలియవచ్చిన అనుభవాన్ని పరిశీలించడానికి, సూత్ర విధానాలను రూపొందించడానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏమన్నా ఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించడానికి ఈ విభాగం కృషిచేస్తుంది. 1957-58లో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను జిల్లాలలో నియమించడం ద్వారాను, గణాంక వివరాల సేకరణ, సంకలనం చేయటంకోసం ప్రధాన కార్యాలయంలో ఒక విభాగం ఏర్పాటు చేయడం ద్వారాను ఈ పథకం అమలు జరుపబడింది. 1958-59 లో ఇది కొనసాగించబడింది.

1959-60సంవత్సరంలో డిప్యూటిరిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టిషియను, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జవానులతో కూడిన అదనపు సిబ్బందిని జిల్లాలలోని సిబ్బందికి సూచన లివ్వటానికి,నియంత్రణ చేయడానికి గాను రిజిస్ట్రారు కార్యాలయంలో నియమించేటందుకు, క్రొత్త సర్కిళ్లకు 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమస్తాలను నియమించేటందుకు ప్రతిపాదింపబడింది. క్రొత్త విధానాలను రూపొందించి వాటిని అమలు పరచడానికిపద్ధతులను రూపొందించడానికిగాను సహకార శాఖలో పరిశోధన, పరిశీలన, ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. మొట్టమొదటగా ముగ్గురు సహకార సబ్-రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన సిబ్బంది ఈ విభాగంలో నియమించబడుతుంది. పై కార్యక్రమాన్ని అమలు జరపటంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది.

ఇందులో రు. 0.34 లక్ష మొత్తం ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద, ప్రచారం మొదలయిన వాటికయ్యే ఖర్చు క్రింద ప్రత్యేకించబడింది. మిగిలిన రు. 1. 36 లక్షలలో రు. 6,044 లు ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించబడింది.

## సహకార సంఘాల సభ్యులకు, పంచాయితీదార్లకు శిక్షణ

అఖిల భారత సహకార యూనియనుద్వారా భారత ప్రభుత్వం వారిచే ప్రతిపాదింపబడిన పథకం నమూనాలో ఈ పథకం రూపొందించబడింది. ఈ పథకం క్రింద సహకార సిద్ధాంతం యొక్క మూల సూత్రాలనుగురించి, ఆచరణనుగురించి, లెక్కలను తయారు చేయటం గురించి, సహకార సంస్థల నిర్వహణ గురించి గ్రామీణ పరపతిసంఘాల సభ్యులకు రెండు, మూడు రోజుల పాటు, పంచాయతీ దారులకు ఒక వారం రోజులపాటు, సహకార సంఘాలలో జీతంతో పనిచేసే వారికి 5 లేక 6 వారాల పాటు శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలో 1,000 మంది సభ్యులకు, 300 మంది పంచాయితీ దారులకు, 40 మంది కార్యాలయోద్యోగులకు శిక్షణ ఇవ్వటం కోసం 1959-60 లో రు. 7,246 లు కేటాయించబడినాయి.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయటంద్వారాను వాటా మూలధనంక్రింద, ఎద్దులు కొనుక్కోటానికి, భూమినిసాగులోనికితెచ్చి అభివృద్ధి చేయటానికి, వ్యవసాయ పరికరాలు మొదలయిన వాటిని కొనుక్కోవటానికిగాను ఋణాల రూపంలోను, గ్రాంట్ల రూపంలోను, ధనసహాయం చేయటంద్వారాను భూముల్లేని వ్యవసాయ కూలీలకు భూములలో పునరావాసం కల్పించటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 2.22 లక్షల మొత్తం కేటాయింప బడింది. ఇందులో రూ. 1.34 లక్షలు ఆంధ్ర ప్రణాళిక క్రింద. రూ. 0 88 లక్ష తెలంగాణా ప్రణాళిక క్రింద కేటాయించ బడ్డాయి. సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించ

టానికై ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బంది జీతభత్యాల క్రింద పై మొత ంలో రూ. 0.28 లక్ష ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రూ. 14,500 లు ఈ జిల్లాకు కేటాయించ బడినాయి. ఇందులో రు. 6,000 లు యీ జిల్లాలో యింతకుముందు ఏర్పాటుచేయబడిన సంస్థలకు సిబ్బందిని నియమించేటందుకు అయ్యే ఖర్చు క్రింద రు. 8,530 లు ఈ జిల్లాలో ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడబోయే సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి ఈ ధనం వినియోగించ బడుతుంది. ఈ జిల్లాలో ఒక క్రొత్తసంఘం ఈ సంవత్సరంలో 75 మంది సభ్యులతో ఏర్పాటుచేయబడుతుంది. 750 ఎకరాల భూమి సాగు చేయబడుతుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ

దేశంలో గిడ్డంగుల నిర్మాణావశ్యకతను గురించి పెక్కు కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కిచెప్పాయి. అవి పరపతి సంఘాలకు పరపతేతర సంఘాలకు మధ్య చక్కని సారథ్యం వహిస్తాయి. ఈ విషయం దృష్ట్యా భారత ప్రభుత్వమువారు వేరుహౌసింగు కార్పొరేషను (గిడ్డంగి సంస్థను) ను ఏర్పాటు చేశారు. దీని కనుగుణంగా తమ తమ రాజ్యాలలో రాజ్య గిడ్డంగి కార్పొరేషన్లు ఏర్పాటు చేయవలసిందిగా రాజ్యప్రభుత్వాలు కోరబడినాయి. ఈ కార్పొరేషన్లు వేరు హౌసింగు బోర్డు అజమాయిషీక్రింద పనిచేస్తాయి. ఈ గిడ్డంగులు ఇచ్చే రశీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్లుగా పరిగణించబడతాయి ఈ గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువచేసుకొనే వారికి ఇవి ఇచ్చేరశీదులు ధరావతుగా ఉంచుకొని బ్యాంకులు అప్పులను ఇస్తాయి. 1958 59 లో రాజ్యగిడ్డంగిసంస్థ ఒకటిఈ రాజ్యంలో ఏర్పాటుచేయబడింది. ఈ సంస్థవాటా మూలధనంక్రింద ప్రభుత్వంవారు రూ.2.50లక్షలమొత్తం ఇచ్చారు ఈ సంస్థకువాటా మూలధనం క్రింద మరికొంత డబ్బు ఇచ్చేటందుకుగాను ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రూ. 5 లక్షలు తెలంగాణా ప్రణాళికలో రూ. 5 లక్షలు కేటాయించ బడినాయి. ఈ పథకం క్రింద ఈ జిల్లాలోని రైతులకుకూడ లాభం చేకూరుతుంది.



వరంగల్లు జిల్లా
1-4-59 తేదీ నాటికి ఉన్న
సామాజికాభివృద్ధి ప్రాంతాలు
కరీంనగరు జిల్లా
తూర్పుగోదావరి జిల్లా
ఖమ్మం జిల్లా
నల్లగొండ జిల్లా
మెదకు జిల్లా
ములుగు
నరసంపేట
సూచన
రాజ్యసరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
బ్లాకుసరిహద్దు
బ్లాకు కేంద్రం
మొదటి దశ బ్లాకులు
రెండవ దశ బ్లాకులు
బహుళార్థసాధక బ్లాకులు
ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 మార్చి నెల అంతంనాటికి ఈ జిల్లాలో 4 మొదటిదశ బ్లాకులు, ఒక రెండవదశ బ్లాకు, ఒక బహుళార్థసాధక బ్లాక్, ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి. వీటిపై శాల్యం 2898.21 చదరపు మైళ్లు. ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 632. ఇందు నివశించే జనాభా సంఖ్య 5,62,199 భారత ప్రభుత్వంవారినిర్ణయాను సారంగా 1959 ఏప్రిలు నెలనుండి ఏర్పాటు చేయబడబోయే ప్రతిబ్లాకులో కూడ ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం క్రింద ఒక సంవత్సరంపాటు వ్యవసాయ విషయాలను గురించి తీవ్రకృషిచేయాలి.

అదేప్రకారం 1-4-58 తేదీనాడు వార్ధన్నపేట బ్లాకులోను, 2-10-1958 తేదీనాడు జనగాంబ్లాకులోను ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం ప్రారంభించబడింది. 1-4-58 తేదీనాడు ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 1-4-1959 తేదీనాటికి మొదటి దశబ్లాకు అవుతుంది. అదేవిధంగా 2-10-58 నాడు పై కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 2-10-1959 నాడు మొదటిదశ బ్లాకుగా రూపొందుతుంది. 1959-60 లో యీ రాజ్యానికి 36 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 1-4-1959 నాడు 18, మిగతవి 2-10-1959 నాడు ప్రారంభించ బడినాయి. ఈ 36 బ్లాకుల్లోను యీ జిల్లాకు రెండు కేటాయించ బడినాయి. అబ్బయ్యపాలెంలో ఒకటి (1-4-1959). ఘనాపూర్‌లో ఒకటి (2-10-1959) ప్రారంభించ బడినాయి. ఆ విధంగా 1-4-1959 నాటికి ఈజిల్లాలో 5 మొదటిదశ బ్లాకులు, ఒక రెండవ దశ బ్లాకు, ఒక బహుళార్థ సాధక బ్లాకు 2 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4,29,600 లు ఋణాల పద్దుక్రింద రు. 7,90 400 లు గ్రాంట్లు పద్దుక్రింద-మొత్తం రు. 12,20,000 లు కేటాయించబడినాయి.

1-4-1959 వ నాటికి ఈ జిల్లాలో ఉన్న సామాజికాభివృద్ధి బ్లాకులను చూపే పటం ప్రక్క పుటలో ఇవ్వబడింది.

# పంచాయతీలను పటిష్ఠం చేయటం

## సిబ్బందికి సంబంధించిన పథకం

పంచాయతీలను పటిష్ఠంచేసే ఉద్దేశంతో జిల్లాస్థాయిలో జిల్లా పంచాయితీ ఆఫీసరును, రెవిన్యూ డివిజను స్థాయిలో డివిజనలు పంచాయితీ ఆఫీసరును, తాలూకాస్థాయిలో (బ్లాకు ప్రాంతాలను మినహాయించి) డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయితీలకు ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లను నియమించటం ద్వారా 1958-59 సంవత్సరంలో పంచాయితీల నిర్వహణకు సంబంధించిన పరిపాలనా యంత్రాంగం పునర్వ్యవస్థీకరించబడింది. 1959-60 లో ఈ పథకం క్రింద రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.120 లక్ష మొత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించేటందుకు. రు. 0.191 లక్ష మొత్తం పశ్చిమ, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాల్లో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించే టందుకుగాను ప్రత్యేకించ బడింది. అధికవ్యయం అయ్యే జిల్లాలకు పంపకంచేసే నిమిత్తం రు. 0.524 లక్ష మొత్తం ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ అధీనంలో ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షల మొత్తంలో రు. 0.3985 లక్ష 1958-59 లో ఈ జిల్లాలో నియమించబడిన అదనపు సిబ్బంది కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణకు సంబంధించిన పథకం

ఈ పథకం క్రింద సామర్లకోట, రాజేంద్రనగరులలోని ఎక్స్‌టెన్షన్ శిక్షణ కేంద్రాలలో పంచాయతీలకుగాను నియమించబడిన డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలన నిర్వహణ విషయంలో శిక్షణ ఇచ్చేటందుకు ప్రతిపాదింపబడింది. ఈ శిక్షణ రెండు మాసాలు ఇవ్వబడుతుంది. తడవకు 40 మంది ఆఫీసర్లకు యీ శిక్షణ ఇవ్వబడుతుంది. మొత్తం 390 మంది పై వర్గాలకు చెందినట్టి ఆఫీసర్లకు 1959-60 లో శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి రు. 2.90 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని ఆఫీసర్లకు కూడా యీ పథకం క్రింద శిక్షణ ఇవ్వబడుతుంది.

# విద్యుచ్ఛక్తి

## తెలంగాణా హైడ్రోథర్మల్ పథకం

(1) రామగుండం థర్మల్ పథకం క్రింద పనులు (2) నిజాంసాగరు జల విద్యుచ్ఛక్తి పథకం క్రింద పనులు (3) సిటీ సర్క్యూల్ పునర్వ్యవస్థీకరణ ఇవన్నీ ఈ సమగ్ర పథకం క్రిందకు తేబడినాయి. తెలంగాణాకు సమగ్రమైన గ్రిడ్ నొక దానిని ఏర్పాటు చేయటం కోసం అవసరమైన అదనపు ట్రాన్స్మిషను లైన్లను వేయటం, సబ్ స్టేషనులను నిర్మించటం కూడ ఈ పథకం క్రింద జరుగుతుంది. ఈ ప్రాంతంలో ఉన్న అన్ని జల విద్యుచ్ఛక్తి కేంద్రాలను కలిపి విద్యుచ్ఛక్తి వనరులను అభివృద్ధి చేయటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. హైదరాబాదు, సికిందరాబాదు నగరాల్లో రోజు రోజుకు ఎక్కువవుతున్న విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చటం కోసం విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లను అభివృద్ధి చేయటం కూడ ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి ఈ పథకం క్రింద రు. 100.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అది క్రింది పనులకుగాను వినియోగించ బడుతుంది:—

1. ఎల్లిగడ్డ-విజయవాడ 132 కె. వి. లైను
2. కరీంనగరు-సిద్దిపేట 66 కె. వి. లైను (రెండవ సర్క్యూటు)
3. దాదాపు 200 మైళ్లు 33 కె. వి. గ్రిడ్ సబ్ ట్రాన్స్మిషను లైన్లు
4. దాదాపు 500 మైళ్ల 11 కె. వి. ట్రాన్స్మిషను లైన్లు
5. హుస్సేనుసాగరు విద్యుచ్ఛక్తి కేంద్రంలో అదనపు బాయిలరును ఏర్పాటు చేయటం కోసం సివిల్ పనులను ప్రారంభించడానికి,
6. నగర విద్యుచ్ఛక్తి సరఫరాలకు అభివృద్ధి పనులు.

కేటాయించబడిన 100.59 లక్షలలో ఈ జిల్లావాటా రు. 5.83 లక్షలు.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1959-60 లో రు. 75.54 లక్షల వ్యయంతో తెలంగాణా ప్రాంతంలో 100 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు ప్రతిపాదింప బడింది. ఇందులో రు. 15.11 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 20 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరుగుతుంది.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## వరంగల్లులో రంపపుమిల్లు, కలపసీజనింగు యంత్రాన్ని ఏర్పాటు చేయటం

కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామాను తయారు చేయటానికి ఉప యోగించే కలప నాణ్యతను అభివృద్ధిచేయటానికి, ప్రయివేటురంగంలో ఏర్పాటు చేయబడిఉన్న చిన్న చిన్న యూనిట్లకు నమూనా కేంద్రంగా ఉపయోగపడటానికి గాను వరంగల్లులో రంపపుమిల్లు, కలప సీజనింగు యంత్రాన్ని ఏర్పాటు చేయ టానికి ప్రతిపాదింప బడింది. ఈపథకం క్రింద 6 మందికి శిక్షణకూడా యివ్వ బడుతుంది. వీరికి ప్రతి నెలా ఒక్కొక్కరికి రు. 30లు చొప్పున స్టయిఫండు కూడ చెల్లించబడుతుంది. ఈకేంద్రానికి అవసరమయిన భవనాలను నిర్మించటం, యంత్రాలను పరికరాలను కొనటం 1958-59లోనే పూర్తయింది. ఈ కేంద్రం పనిచేయటానికి, ఆరు మందికి శిక్షణ యివ్వటానికిగాను ఈసంవత్సరపు ప్రణాళి కలో రు. 0.48 లక్ష కేటాయించ బడింది. ఈ కేంద్రం వల్ల రు. 40,000 ల రాబడి ఉంటుందని ఆశించబడుతున్నది.

## వడ్రంగానికి సంబంధించిన రెండు నమూనా కేంద్రాల ఏర్పాటు

వడ్రంగానికి సంబంధించిన శిక్షణ-ఉత్పత్తి కేంద్రాలుగా ఉపయోగపడే టందుకుగాను వరంగల్లు, మహబూబాబాదులలో రెండు నమూనా వడ్రంగం

కేంద్రాలను స్థాపించుటకు ప్రతిపాదించబడింది. గ్రామాల్లో పనిచేసే వడ్రంగులకు యీ కేంద్రాల్లో ఆధునిక విధానాలను అవలంబించటం గురించి శిక్షణ యివ్వటమే గాక శ్రమను తగ్గించే మార్గాలను అవలంబిస్తూ వ్యాపార సరళిలో ఉత్పత్తి కార్యక్రమం కూడ మొదలు పెట్టబడుతుంది. భవనాల నిర్మాణం యంత్రాలు, పరికరాలు కొనటం గత సంవత్సరమే పూర్తి చేయబడింది

ఈ సంవత్సరపు ప్రణాళికలో పై కేంద్రాలు పనిచేయటానికి, 24 మంది పని వారికి శిక్షణ యివ్వటానికి గాను, రు 0.77 లక్ష మొత్తం కేటాయించబడింది ఈ కేంద్రాల మూలంగా రు. 50,000ల ఆదాయం వుంటుందని ఆశించబడుతున్నది.

## వరంగల్లులో ఒకటి, ఖమ్మంలో ఒకటి కమ్మరానికి సంబంధించిన రెండు నమూనా కేంద్రాల ఏర్పాటు

గ్రామాల్లో పనిచేసే కమ్మరి పనివారికి మేలు రకం విధానాలను అవలంబించటం గురించి శిక్షణ యివ్వటానికే గాక వ్యాపార సరళిలో వ్యావసాయిక పరికరాలను ఉత్పత్తి చేయటానికిగాను 1958-59 సంవత్సరంలో వరంగల్లులో ఒకటి, ఖమ్మంమెట్టులో ఒకటి—మొత్తం రెండు నమూనా కమ్మరి పని కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. భవనాల నిర్మాణం, యంత్రాల కొనుగోలు గత సంవత్సరమే పూర్తి కావించ బడింది

ఈ కేంద్రాలను నిర్వహించటానికి, 16 మంది పని వారికి శిక్షణ యివ్వటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 60,000 ల మొత్తం కేటాయించబడింది. ఈ కేంద్రాల మూలంగా రు. 40,000 ల ఆదాయం ఉంటుందని అంచనా వేయబడింది

## ములుగులో "స్ప్లింటులు," "వెసీర్లు" తయారి

ములుగులో "స్ప్లింటులు" "వెసీర్లు" తయారు చేయటానికిగాను ఒక యూనిట్టును స్థాపించటం కోసం 1959-60 ప్రణాళికలో రు. 0.82 లక్ష మొత్తం కేటాయించబడింది. అయితే ఈ జిల్లాలో "స్ప్లింటులు". "వెసీర్లు" తయారు చేసే మరొక ఫ్యాక్టరీ పనిచేయటం ప్రారంభించినందు వల్ల ప్రస్తుతానికి యీ పథకాన్ని అమలు జరపటం నిలిపి వేయబడింది.

## ములుగులో సుంద్రాకర్రనుండి కత్తాను తీసే కేంద్రం ఏర్పాటు

ములుగు పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలో సుంద్రా కర్ర సమృద్ధిగా దొరుకు తుంది. దీని నుండి కత్తాను తీయటం కోసం ములుగులో ఒక చిన్న యూనిట్టును ఏర్పాటు చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ యూనిట్టుకు అవసర మయిన భవనాలను నిర్మించటానికి, పరికరాలను సమకూర్చటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.21 లక్ష మొత్తం కేటాయించబడింది.

## వరంగల్లులో జనరల్ ఇంజనీరింగ్ సర్వీసింగు వర్కుషాపు ఏర్పాటు

వరంగల్లులోని చిన్న తరహా పారిశ్రామికదారులకు, ముఖ్యంగా వరంగల్లు పారిశ్రామిక ఎస్టేటులో కౌలుకున్న పారిశ్రామికదారులకు, సర్వీసింగు కేంద్రంగా ఉపయోగపడటానికిగాను వరంగల్లులో జనరల్ ఇంజనీరింగు సర్వీసింగు వర్కు షాపును స్థాపించుటకు ప్రతిపాదింపబడింది. ఈకేంద్రం టూల్ రూముగా ఉపయోగ పడుతుంది. వరంగల్లులోని పారిశ్రామిక ఎస్టేటులో దీనిని స్థాపించటం జరుగు తుంది. భవనాలను నిర్మించటానికి, యంత్రాలు, పరికరాలు కొనటానికిగాను ఈ సంవత్సరంలో యీపథకానికిగాను రు. 2.09 లక్షల మొత్తం కావలసిఉంది. చిన్న తరహా పథకాలకు కావలసిన యంత్రాలను ఖరీదు చేయటం కోసం యీ సంవత్స రపు బడ్జెటులో డబ్బు కేటాయించడం జరిగింది. అయితే యీ పరికరాలనన్నిటినీ "నేషనల్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్" ద్వారా 1959 మార్చిలోనే ఖరీదు చేయడం కారణంగా ఈ సంవత్సరపు బడ్జెటులో రు. 11.20 లక్షల మొత్తం మిగులు కనబడింది ఈ పథకానికి కావలసిన డబ్బును పై మిగులు ధనంలో నుండి వినియోగించు కోవటానికి ప్రతిపాదింపబడింది.

## కమ్మరి పని ప్రదర్శనకు సంబంధించిన సంచార యూనిట్టు ఏర్పాటు

గ్రామాల్లో పనిచేస్తున్న కమ్మరి పనివారు తమ ఉత్పత్తి విధానాన్ని మెరుగుపరచు కొనేటందుకుగాను వారికి ఆధునిక యంత్రాలను, మేలురకం పరికరాలను వాడటంగురించి ప్రదర్శనపూర్వకంగా తెలియచేయటంకోసం ఒక

పంచార యూనిట్టును ఏర్పాటు చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. కరీంనగరు జిల్లాలో ప్రస్తుతం యీ వ్యాను పనిచేస్తున్నది.

రు 0 15 లక్ష వ్యయంతో ఈ సంవత్సరంలో యీ వ్యాను కరీంనగరు జిల్లా అంతటిలోను, వరంగల్లు జిల్లాలో కొంతభాగంలోను ఇందుకు సంబం ధించిన కార్యక్రమాన్ని జరిపిస్తుందని ఆశించబడుతున్నది.

## పది సహకార పరిశ్రమ కేంద్రాలను ఏర్పాటు చేయటం

సామాన్య సౌకర్యాలను పనివారందరికి అందుబాటులో ఉంచటంద్వారా వారు మేలురకం వస్తువులను పెద్దఎత్తున ఉత్పత్తి చేయటానికి వీలు చేకూరు తుంది. అట్టి సౌకర్యాలను కలిగించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలో పది సహకార పరిశ్రమ కేంద్రాలు 1957-58 లో ఏర్పాటు చేయబడినాయి. ఈ కేంద్రాలలో దాదాపు 200 మందికి పని కల్పించబడింది. ఈ పథకంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.24 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0 072 లక్ష మొత్తం ఈ జిలాలో ఏర్పాటు చేయబడిన 3 కేంద్రాల కొనసా గింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

## పరిశ్రమలకు హైదరాబాదు ప్రభుత్వ సహాయచట్టం క్రింద ఋణాలు

చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధి చేసేందుకుగాను ప్రయివేటు రంగంలోని పారిశ్రామికులకు ప్రభుత్వ సహాయ చట్టం (స్టేటు ఎయిడు టు ఇండస్ట్రీస్ చట్టం) క్రింద ఋణాలు ఇవ్వటంకోసం రెండవ ప్రణాళికలో రు 37.40 లక్షల మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరా ల్లోను రు. 20.78 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. ఈ సంవత్సరంలో రు. 7.00 లక్షలు ఈ పథకంక్రింద ఋణాలుగా ఇవ్వటం జరుగుతుంది. ఈ పథకంవల్ల ఈ జిల్లాలోని పారిశ్రామికులకుకూడ లాభం చేకూరుతుంది.

## పరిశ్రమల శాఖ డైరెక్టరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటం (జిల్లాల సిబ్బందికి మాత్రం చేయబడిన కేటాయింపు)

రెండవ పంచవర్ష ప్రణాళికలో పేర్కొనబడిన వివిధ పథకాలను జిలా స్థాయిలో సక్రమంగాను, సమర్థవంతంగాను అమలు జరిపేటందుకుగాను పరి

శ్రిమ శాఖను పటిష్టం చేసే ఉద్దేశంతో తెలంగాణా ప్రాంతం కోసం రెండవ ప్రణాళికలో రు. 6.10 లక్షల మొత్తం కేటాయించ బడింది. 1957-58, 1958-59 సంవత్సరాలలో కొంత అదనపు సిబ్బంది జిల్లాలలో నియమించబడింది. ఈ సిబ్బందిని కొనసాగించే టందుకు, మరికొంత అదనపు సిబ్బందిని నియమించేటందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపుల సరఫరా

వివిధ పథకాలను సమర్థవంతంగా అమలు జరిపేటందుకు వీలు కల్పించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలోని తొమ్మిది జిల్లాలలోను పనిచేస్తున్న పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టర్లు తొమ్మిది మందికి 1958-59 లో జీపులు సరఫరా చేయబడినాయి ఈ జీపుల నిర్వహణకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.30 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో ఒక జీపు ఈ జిల్లాలో ఉపయోగించబడుతున్నది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్లకు జీతాలు

బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద 1959-60 ప్రణాళికలో రు. 3 06 లక్షల మొత్తం కేటాయించబడింది.

## వరంగల్లులో పారిశ్రామిక ఎస్టేటు ఏర్పాటు

వరంగల్లులో పారిశ్రామిక ఎస్టేటు ఏర్పాటు చేయటంకోసం రెండవ ప్రణాళికలో రు. 10.00 లక్షల మొత్తం కేటాయించబడింది. 1958-59లో 14.17 ఎకరాల స్థలం సేకరించబడి 16 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం ఆరంభించబడింది. ఇందుకుగాను రు. 1.27 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. గత సంవత్సరంలో నిర్మించడం ప్రారంభించిన 16 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం పూర్తిచేయటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

# హస్తకళలు

## వరంగల్లులో తివాసీలు, కంబళ్ళ పరిశ్రమ

వరంగల్లులోని చిన్న తరహా, కుటీర పరిశ్రమల సహకార సంఘం మేలురకం పద్ధతుల్లో తివాసీలను, కంబళ్ళను అధికంగా ఉత్పత్తి చేసేటట్లు చేయటంకోసం దానిని విస్తృత పరచటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ సహకార సంఘ సభ్యుల ఉపయోగానికై 1957–58లో ఒక అద్దకం కేంద్రం ఏర్పాటు చేయబడింది. 1956–59 సంవత్సరాల కాలంలో 5,650 తివాసీలు, కంబళ్ళు యీ సంఘంద్వారా ఉత్పత్తి చేయబడినాయి. యీ సంవత్సరంలో యీ సంఘాన్ని, అద్దకం కేంద్రాన్ని కొనసాగించటానికిగాను ప్రణాళికలో రు. 0 03 లక్ష మొత్తం కేటాయించబడింది. సుమారు 2,250 తివాసీలు ఈ సంవత్సరంలో ఉత్పత్తి చేయబడతాయని ఆశించబడుతున్నది.

## జనగాంలో పూసల పరిశ్రమ అభివృద్ధి

సహకార పద్ధతులపై వ్యవస్థీకరించటంద్వారా జనగాంలో పూసల పరిశ్రమను అభివృద్ధి పరచటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఇందుకుగాను 1957–58లో ఒక సహకార సంఘం ఏర్పాటు చేయబడింది. జనగాం పూసల పని వారి పారిశ్రామిక సహకార సంఘం అని యిది పిలువబడుచున్నది. 1958–59లో యీ సంఘం రు. 3,000 లు విలువగల పూసలు తయారుచేసింది. ఈ సంఘానికి చెందిన పర్యవేక్షక సిబ్బందికి జీతాలు, యితర చిల్లర ఖర్చులకింద యీ సంఘానికి ఆర్థిక సహాయం చేయటంకోసం 1959–60 లో రు. 0 05 లక్ష కేటాయించబడింది.

## వరంగల్లులో రెండవ తరగతి సేకరణ—అమ్మకం డిపోను ప్రారంభించటం

చేతిపనులకు సంబంధించి 1958–59లో సేకరణ అమ్మకం-డిపో ఒకటి వరంగల్లులో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో యీ డిపోను కొనసాగించుటకుగాను రు 0.36 లక్ష మొత్తం కేటాయించబడింది.

## క్రొత్త పథకాలు

ఈ సంవత్సరంలో క్రింది క్రొత్త పథకాలు రాజ్యస్థాయిలో హస్తకళల విభాగంక్రింద అమలు పరచబడతాయి. ఇందువల్ల తెలంగాణాలోని అన్ని జిల్లాలకు లాభం చేకూరుతుంది.

| పథకం పేరు. | 1959—60 లో కేటాయింపు (లక్షల రూపాయలలో). |
| --- | --- |
| సహకార సంఘాల క్రిందకు తీసుకు రావటానికి వీలులేకుండా ఉన్న పనివారికి గ్రాంట్లు, ఋణాలు ఇవ్వటానికి | 0.10 |
| సంచార ప్రచార వ్యానుకు, దానికి కావలసిన సిబ్బందికి. | 0.20 |
| వస్తువుల నాణ్యతను ధృవీకరించడానికి. | 0 10 |

## వరంగల్లు రైల్వేస్టేషనులో చేతి పనివస్తువుల షోకేసులను ఏర్పాటు చేయటం

వరంగల్లు రైల్వే స్టేషనులో చేతిపనివస్తులను ప్రదర్శించే షోకేసులను ఏర్పాటు చేయటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పట్టు పరిశ్రమ

## వెంకటాపురం, మహాదేవపురంలలో టస్సరు విత్తనాల కేంద్రాలు స్థాపించటం

వ్యాధిరహితమయిన టస్సరు విత్తనాల కాయలను ఉత్పత్తిచేసి. టస్సరు పరిశ్రమలో పనిచేస్తున్న కొండ తెగలవారికి సరఫరా చేయటంకోసం 1957-58లో వెంకటాపురంలోను, మహదేవ పురంలోను రెండు టస్సరు విత్తనాల కేంద్రాలు

ఏర్పాటు చేయబడినాయి. ప్రతి కేంద్రంలోను 12 మంది కొండతెగల బాలురకు "రేరింగు", "రీలింగు" విషయంలో ఉత్తమ పద్ధతుల్నిగురించి శిక్షణ ఇచ్చే టందుకు పై కేంద్రాలలో సదుపాయాలున్నాయి. 1958-59లో ప్రతి కేంద్రం లోను "గ్రెయినేజు" భవనాలు నిర్మించబడినాయి. 12 మంది బాలురకు శిక్షణ యివ్వబడింది. ఈ సంవత్సరంలో రు. 0.61 లక్ష మొత్తం కేటాయించబడింది. రు. 0.31 లక్ష వెంకటాపురంలోని కేంద్రానికి, రు 0.30 లక్ష మహదేవపురం లోని కేంద్రానికి పై మొత్తంలో ప్రత్యేకించబడింది. ప్రతి కేంద్రంలోను వ్యాధిరహితమయిన 10,000 టస్సరు పత్తనాల కాయలు ఉత్పత్తి చేయటం జరుగుతుందని 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటం జరుగుతుందని ఆశించ బడుతున్నది

## సాలవాయిలో ప్రభుత్వ సిల్కు-ఫారంను పటిష్ఠం చేయటం

మల్బరీ చెట్లను పెంచటంలోను, పట్టు పురుగులను పెంచటంలోను ఉత్తమ విధానాలను ఆదిమజాతుల వారికి ప్రదర్శించటానికి, ఆదిమజాతుల బాలురకు శిక్షణ యివ్వటానికిగాను సాలవాయిలోని ప్రభుత్వ సిల్కు-ఫారంను సౌష్ఠవంగా నిర్వహించుటకు తగిన అదనపు సౌకర్యాలను కలిగించటంద్వారా దానిని అభివృద్ధి చేయటానికి ప్రతిపాదింపబడింది. 1958-59లో ఈ ఫారంలో రు. 0 20 లక్ష వ్యయంతో ఒక నమూనా 'రేరింగు హౌసు' నిర్మించబడింది. అదనంగా 18 ఎకరాల ప్రదేశంలో రైతులు మల్బరీ తోటలను వేశారు. 1957-58, 1958-59 లలో 8 మంది ఆదిమజాతి బాలురకు శిక్షణకూడ యివ్వ బడింది. ఈ పథకాన్ని కొనసాగించటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.21 లక్ష మొత్తం కేటాయించబడింది. 200 ఎకరాల ప్రదేశం మల్బరీ తోటలక్రిందకు తీసుకరాబడుతుందని ఆశించబడుతున్నది.

## క్రొత్త పథకాలు

## సాలవాయిలోని ప్రభుత్వ సిల్కు-ఫారంలో నీటి పారుదల సౌకర్యాలు కలిగించటం

సాలవాయిలోని ప్రభుత్వ సిల్కు-ఫారంలో నీటి పారుదల సౌకర్యాలు కల్పించేటందుకు సంబంధించిన పథకాన్ని అమలు పరచుటకుగాను ఈ సంవత్స రపు ప్రణాళికలో రు. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది.

# చేనేత పరిశ్రమ

## చేనేత పారిశ్రామిక సంఘాలకు వాటా మూలధనం, నిర్వహణ మూలధనం క్రింద ఋణాలు

చేనేత పారిశ్రామిక సంఘాలలో వాటాలు తీసికొని, వాటిలో సభ్యులుగా చేరటానికి వీలుగా నేతపనివారికి ఈ పథకంక్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరపు తెలంగాణా ప్రణాళికలో ఈ పథకంక్రింద రు. 0.87 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష వాటా మూలధనంగా ఋణాలు రూపంలో పంపకానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ జిల్లాలో ఈ సంవత్సరంలో దాదాపు 866 క్రొత్త మగ్గాలు సహకార వ్యవస్థలోకి తీసుకు రాబడతాయని ఆశించబడుతున్నది.

## కేంద్ర సంఘంయొక్క మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

నేత బట్టలను విరివిగా విక్రయించేటందుకు హైదరాబాదు చేనేత కార్మిక కేంద్ర సహకార సంఘంవారు, ప్రాథమిక చేనేత కార్మిక సంఘాలవారు జిల్లాల్లో అమ్మకం డిపోలను ఏర్పాటు చేస్తున్నారు. ప్రతి డిపోకు రు. 1,500 లు విలువ చేసే కుర్చీలు, బల్లలు మొదలయిన సామాను సరఫరా చేయబడుతున్నది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాల్లో 58 డిపోలు తెరువ బడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 12 డిపోలు తెరవడానికి, చేనేత బట్టలను గురించి తీవ్ర ప్రచారం జరిపించడానికి ప్రతిపాదించబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 1.54 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.25 లక్ష మొత్తం ఈ జిల్లాలో రెండు డిపోలను తెరవటానికి ప్రత్యేకించబడింది

## సాంకేతిక అభివృద్ధి, మేలు రకం పరికరాలు

చేనేత పరిశ్రమలో సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఈ పథకం క్రింద చేనేత కార్మికులకు మేలు రకం పరికరాలు సరఫరా చేయ బడతాయి. ఇందుకు గాను ఈ సంవత్సరంలో రు. 1.91 లక్షల మొత్తం కేటా

యిరచబడింది ఇందులో రు. 0.24 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 37 ప్రామాణికమైన రీడ్లు, 10 వార్పింగు యంత్రాలు, 36 స్లేలు, 3 ప్రెస్ యంత్రాలు సరఫరా చేయబడతాయి.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించడం ద్వారా దాని ఉత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతో చేనేత గుడ్డ అమ్మకంపై ముదరా ఇవ్వబడుతున్నది. సాధారణంగా రూపాయకు ఆరు నయాపైసల చొప్పున ముదరా ఇవ్వబడుతున్నది. అయితే సంఘాల్లో సరకు నిలువ ఉండి పోయినపుడు మాత్రం దాన్ని అమ్మివేయటం కోసం అప్పుడప్పుడు అదనపు ముదరా కూడ ఇవ్వడానికి అనుమతించబడుతున్నది. ఈ పథకం క్రింద ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.50 లక్షల మొత్తం ఈ జిల్లాలో ముదరా ఇవ్వటం కోసం ప్రత్యేకించబడింది.

## ఉన్ని పరిశ్రమ (కంబళ్ళ పరిశ్రమ)

తెలంగాణా ప్రాంతంలో ఉన్ని పరిశ్రమ అభివృద్ధి కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.58 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.31 లక్ష మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

(ఏ) 75 క్రొత్త మగ్గాలను చేర్చుకొనడానికి

(బి) ఉన్ని నేత పనివారికి క్రింది మేలు రకం పరికరాలను సరఫరా చేయడానికి

| | | |
|---|---|---|
| (1) | ఫ్లయి షటిల్ మగ్గాలు | 5 |
| (2) | హీల్డులు | 5,000 |
| (3) | రీడ్లు | 20 |
| (4) | ఉన్ని కార్డింగు యంత్రాలు | 1 |

(సి) నైపుణ్య స్థాయిని నియంత్రణ చేయటం కోసం ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్ల నియామకానికి.

## నేత పని వారికి గృహ వసతి

తెలంగాణాలోని నేత పనివారి గృహవసతి సౌకర్యాలను అభివృద్ధి చేసే నిమిత్తం 1959-60 ప్రణాళికలో రు. 2.11 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.70 లక్ష మొత్తం వరంగల్లు జిల్లాకు 150 ఇళ్ళ నిర్మాణంకొరకు కేటాయించబడింది. ఈ 150 ఇళ్ళలోను 100 ఇళ్ళు జనగాంలోను, 50 ఇళ్ళు ములుగులోను నిర్మించబడతాయి.

# రోడ్లు

## క్రొత్త రోడ్డు పనులు

తెలంగాణా ప్రాంతంలో క్రొత్త రోడ్డు పనుల నిర్వహణ నిమిత్తం 1959_60 లో ఈ పథకం క్రింద రు. 37.69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.00 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959-60లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | మహబూబాబాదునుండి ఎల్లందుకు రోడ్డు నిర్మించటం (భాగం). | 3.00 |
| 2. | వెలిగొండు నుండి తిరువూరుకు కొంత భాగం రోడ్డు నిర్మించటం. | 1.00 |

## పర్యటనత్వాభివృద్ధి

తెలంగాణాలో పర్యటనత్వాభివృద్ధి కోసం 1959_60 ప్రణాళికలో రు. 2.04 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష యీ జిల్లాలో క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య. | పని వివరం | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | రామప్ప (పాలంపేట) చెరువు వద్ద ఎక్కువ ఆదాయం వచ్చేవారి కోసం విశ్రాంతి గృహం నిర్మించటం | 0.25 |

| | | |
|---|---|---|
| 2. | పాఖాల్ చెరువు వద్ద ఎక్కువ ఆదాయం వచ్చే వర్గంవారి కోసం విశ్రాంతి గృహం నిర్మించటం. | 0.25 |

# విద్య

## సాధారణ విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్య పద్దు క్రింద రు. 7.79 లక్షల మొత్తం క్రింది పథకముల నిమిత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (లక్షల రూపాయల్లో) |
|---|---|---|
| 1. | ఈ క్రింద తెలుపబడిన సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలల కొరకు, నియమింపబడిన అదనపు ఉపాధ్యాయులకొరకు. | |
| | (ఏ) 1956_57 లో 55 పాఠశాలలు | 0.57 |
| | (బి) 1957_58 లో 35 పాఠశాలలు | 0.80 |
| | (సి) 1958_59 లో 70 పాఠశాలలు | 0.25 |
| 2. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలుగా మార్చబడిన వాలంటరీ ఎయిడెడ్ పాఠశాలలు. | |
| | (ఏ) 1956_57 లో 2 పాఠశాలలు. | 0.02 |
| | (బి) 1957_58 లో 34 పాఠశాలలు. | 0.10 |
| | (సి) 1958_59 లో 8 పాఠశాలలు. | 0.03 |

3. ఈ క్రింది సంవత్సరాలలో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు.

| | | | |
|---|---|---|---|
| (ఏ) | 1956_57 లో | 14 పాఠశాలలు. | 0.02 |
| (బి) | 1957_58 లో | 14 పాఠశాలలు. | 0.04 |
| (సి) | 1958_59 లో | 14 పాఠశాలలు. | 0.03 |

4 ప్రాథమిక పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య సామాన్లు, పరికరాలు 0.02

5. ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలు, హాస్టళ్ళకు భవనాలు. (ఒకటి) 0.80

6. ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించ బడిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలకు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయుల కొరకు.

| | | | |
|---|---|---|---|
| (ఏ) | 1956_57 లో | 5 విభాగాలు | 0.05 |
| (బి) | 1957_58 లో | 23 విభాగాలు | 0.10 |
| (సి) | 1958_59 లో | ఒక పాఠశాల | 0 30 |

7. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలో ఉపాధ్యాయుల జీతాల పెంపుదలకు. 0.84

8. 1957_58 లో డిప్యూటీ ఇనస్పెక్టర్ల కార్యాలయాల్లో నియమించ బడిన అదనపు సిబ్బందికి (12 మంది గుమాస్తాలు, ఇద్దరు డిప్యూటీ ఇనస్పెక్టర్లు) 0.10

| | | |
|---|---|---|
| 9. | ఈ క్రింది సంవత్సరాలలో నియమించబడిన డిప్యూటి ఇనస్పెక్టర్లకు. | |
| | (ఏ) 1957—58 (ఇద్దరు డిప్యూటి ఇనస్పెక్టర్లు) | 0.06 |
| | (బి) 1958—59 (ముగ్గురు డిప్యూటి ఇనస్పెక్టర్లు) | 0.10 |
| 10. | 1958–59లో ప్రారంభించ బడిన ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాల (ఒకటి) | 0.33 |
| 11. | ఎయిడెడ్ బేసిక్ శిక్షణ పాఠశాలలకు గ్రాంట్లు | 0.07 |
| 12. | జిల్లా విద్యాశాఖాధికారికి పర్సనల్ అసిస్టెంటు (1958—59 లో నియమించ బడిన ఒకరికి). | 0 02 |
| 13. | జిల్లా విద్యాశాఖాధికారి జీపు నిర్వహణకు, డ్రైయివరుకు. | 0.05 |

## క్రొత్తపథకాలు

| | | |
|---|---|---|
| 14. | విద్యార్హతలు ఉన్న నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించుటకు సంబంధించిన పథకం. | 1.05 |
| 15. | ఉపాధ్యాయుల శిక్షణ కోర్సుకు పంపబడిన ఉపాధ్యాయుల స్థానంలో ఇతరులను నియమించుటకు | 0.55 |
| 16. | 10 ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చుటకు. | 0.05 |
| 17. | ప్రాథమిక పాఠశాలలలో అదనంగా ఉపాధ్యాయులను నియమించుటకు. | 0.09 |

| | | |
|---|---|---|
| 18. | ప్రాథమిక పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య సామానులకు | 0.01 |
| 19. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం ప్రాథమిక స్థాయి శిక్షణ పాఠశాల (ఒకటి) | 0.21 |
| 20. | తాలూకా కేంద్రాలలో ప్రభుత్వ బాలికల పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చుటకు | 0 02 |
| 21. | అదనంగా లోయరు సెకండరీ తరగతులను ప్రారంభించటానికి. | 0.27 |
| 22. | ఒక సెకండరీ గ్రేడు, రెండు ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ విభాగాలను ప్రారంభించుటకు | 0.70 |
| 23. | పట్ట భద్రులయిన ఉపాధ్యాయులకు బేసిక్ విధానాలలో తిరిగి శిక్షణ ఇచ్చుటకు. | 0.01 |
| 24. | డిప్యూటీ ఇనస్పెక్టర్ల కార్యాలయాల్లో 19 మంది అటెండర్లను నియమించుటకు. | 0.13 |
| | మొత్తం. | 7.79 |

## సెకండరీ విద్య

ఈ జిల్లాలో సెకండరీ విద్యాభివృద్ధికోసం రు 4 21 లక్షల మొత్తం కేటాయించబడింది. అది ఈ క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షల్లో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించబడిన ఎయిడెడ్ సెకండరీ పాఠశాలలకు, అదనపు తరగతులకు గ్రాంట్లు. | |
| | (ఏ) 1956-57లో ప్రారంభించబడిన వాటికి. (బి) 1957-58లో ప్రారంభించబడిన వాటికి | 0.15 |
| | (సి) 1958-59లో ప్రారంభించబడిన వాటికి. | 0.03 |

| | | |
|---|---|---|
| 2. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రభుత్వ సెకండరీ పాఠశాలలు, అదనపు తరగతులకు. | |
| | (ఏ) 1956-58లో ప్రారంభించబడిన వాటికి. | 0.05 |
| | (బి) 1958-59లో ప్రారంభించబడిన వాటికి. | 0.05 |
| 3. | బహుళార్థ సాధక పాఠశాలలలో కొన్ని కోర్సులను పునరుద్ధరించటానికి, జీతాలను సవరించటానికి. | 0.01 |
| 4. | సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలను పెంచటానికి. | 0.25 |
| 5. | హిందీ ప్రచారం (హిందీ ఉపాధ్యాయులను నియమించుటకు). | 0.08 |
| 6. | ప్రభుత్వ బహుళార్థ సాధక పాఠశాలలకు భవనాలు. | 0.35 |
| 7. | వరంగల్లు శిక్షణ కళాశాలలో సిబ్బందిని పునర్వ్యవస్థీకరించటానికి, భవనాలకు | 1.20 |
| 8. | 1958-59లో ప్రారంభించ బడిన విద్యాశాఖ రీజినల్ డిప్యూటి డైరెక్టరు కార్యాలయానికి | 0.28 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 9. | ప్రయివేటు ప్రాతిపదికపై నిర్వహించబడుతున్న సెకండరీ పాఠశాలలను స్వాధీన పరచుకొనటానికి, అదనపు తరగతులు ఏర్పాటు చేయటానికి. | 0.30 |

| | | |
|---|---|---|
| 10. | ఒక ఎయిడెడ్ ఉన్నత పాఠశాలకు భవనాల క్రింద గ్రాంట్లు | 0.01 |
| 11. | కోర్ సబ్జెక్టుల (మూల పాఠ్య విషయాలు) అభివృద్ధికి (5 పాఠశాలలు). | 0.10 |
| 12. | అదనపు తరగతి గదులు, ఆర్ట్ హాలు నిర్మాణానికి | 0.07 |
| 13. | సెకండరీ పాఠశాలలకు భవనాలు | 1.00 |
| 14. | ఎయిడెడ్ సెకండరీ పాఠశాలలకు పరికరాల క్రింద గ్రాంట్లు | 0.10 |
| 15. | బహుళార్థ సాధక పాఠశాలలు, హైయ్యరు సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ డైరెక్టర్ల (వ్యాయామ శిక్షకుల) నియామకం. (2) | 0.01 |
| 16. | వరంగల్లులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలో అదనపు సిబ్బంది నియామకం | 0.03 |
| 17. | బహుళార్థ సాధక పాఠశాలలకు అదనపు సిబ్బంది. | 0.14 |
| | మొత్తం. | 4.21 |

## ఇతర పథకాలు

ఈ జిల్లాలో రు. 0.61 లక్ష మొత్తం క్రింద చూపబడిన విధంగా ఖర్చు పెట్టడానికి ప్రతిపాదింప బడింది.

(రూపాయలు, లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | ఒక ఫిజికల్ ఎడ్యుకేషన్ ఇనస్పెక్టర్, ఒక రీజినల్ ఇనస్పెక్టర్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్, ఒక క్లీనర్, ఒక జవాను నియామకం. | 0.34 |

| | | |
|---|---|---|
| 2. | ఎన్. సి సి., ఏ. సి. సి.ల విస్తృతికి. | 0.30 |
| 3. | స్కౌటింగు మరియు గర్ల్ గైడింగుకు. | 0.02 |
| 4. | రియాయితీ స్కాలరుషిప్పులకు. | 0.10 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 5. | ఒక జిల్లా గ్రంథాలయము, 3 బ్రాంచి గ్రంథాలయాలు ఏర్పాటుకు | 0.11 |
| 6 | రియాయితీ స్కాలరు షిప్పులకు. | 0.02 |
| 7. | హిందీ విద్యాలయాలకు గ్రాంట్లు. | 0.01 |
| 8. | యువక సంక్షేమ కార్యక్రమాలకు. | 0 01 |
| | మొత్తం. | 0.61 |

## సాంకేతిక విద్య

### వరంగల్లులో వరంగల్లు పాలిటెక్నిక్‌ను స్థాపించటం (గవర్నమెంటు పాలి టెక్నిక్, వరంగల్లు అని యిప్పుడు దీని పేరు మార్చబడింది).

1955–56లో యీ పాలిటెక్నిక్ స్థాపించ బడింది. సివిల్ ఇంజనీరింగ్‌లో ఒక్క సంవత్సరం డిప్లొమా కోర్సు యిక్కడ ప్రవేశ పెట్టబడింది. రెండవ ప్రణాళికలో కేటాయించిన రు. 20 లక్షలలోను రు. 6.31 లక్షల మొత్తం పరికరాలకొనుగోలుకు, భవనాల నిర్మాణానికి గాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ఖర్చుచేయ బడింది. రు. 1.20 లక్షల మొత్తం విలువగల పరికరాలు కొనేటందుకు, భవనాల నిర్మాణం కొనసాగించేటందుకుగాను యింకా రు. 5 07 లక్షల మొత్తం ఈ సంవత్సరంలో కేటాయించబడింది. ఈ సంస్థ కోసం భవనాలను నిర్మించే కార్యక్రమం ఈ సంవత్సరంలో పూర్తి అవుతుందని ఆశించ బడుతున్నది.

### వరంగల్లులో ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటు చేయుటం

కేంద్రప్రభుత్వ ప్రతిపాదిత సంస్థగా 250 మంది అభ్యర్థులను చేర్చు కోవడానికి వీలుండే ఇంజనీరింగ్ కళాశాలను వరంగల్లులో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించ బడింది పరికరాలకు, భవనాలకు అయ్యే ఖర్చంతా భారత ప్రభుత్వం భరిస్తుంది. మొదటి అయిదు సంవత్సరాల కాలంలో అయ్యే రెకరింగు వ్యయంలో సగం రాజ్య ప్రభుత్వం భరించాలి నీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యం ఉండే 250 ఎకరాల స్థలాన్ని ఉచితంగా రాజ్య ప్రభుత్వం యివ్వాలి భూమి కొనటం కోసం ఈ సంవత్సరంలో రు. 1 25 లక్షల మొత్తం రాజ్య ప్రణాళికలో కేటాయించబడింది. ఇంతేకాక కేంద్రప్రభుత్వం పరికరాల కొనుగోలుకు, భవనాల నిర్మాణం ఆరంభించేటందుకు గాను రు 3 75 లక్షల మొత్తం యిస్తారు.

## వైద్యం

### జిల్లా ఆసుపత్రుల స్థాయిని పెంచటం

ఈ సంవత్సరంలో ఈ పథకం కోసం చేయబడిన మొత్తం కేటాయింపు రు. 6.50 లక్షలలో రు. 0.70 లక్ష మొత్తం, వరంగల్లులో ఉన్న జిల్లా ఆసుపత్రి స్థాయిని పెంచటం కోసం క్రింది విధంగా ఈ జిల్లాలో వినియోగించ బడుతుంది

1. 1958-59లో స్థాపించబడిన ప్రాంతీయ లేబరేటరీని నిర్వహించటం.

1. 200 మంది రోగులను చేర్చుకోవటానికి వీలుండే రెండు అదనపు వార్డులను నిర్మించటం.

### తాలూకా ఆసుపత్రుల స్థాయిని పెంచటం

తెలంగాణా ప్రాంతంలోని తాలూకా ఆసుపత్రుల స్థాయిని పెంచటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 1.50 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈజిల్లా లోకొన్ని తాలూకా ఆసుపత్రులలో సమకూర్చిన అదనపు పడకలను.

సిబ్బందిని నిర్వహించటానికి, యింకా కొన్ని ఆసుపత్రులను అభివృద్ధి చేయటానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## సబ్సిడీ ఈయబడు ఆసుపత్రులు

1958–59లో సబ్సిడీ పద్ధతిపై 37 గ్రామీణ వైద్యశాలలు ప్రారంభించబడినాయి. అవి ఈ సంవత్సరం కొనసాగించబడతాయి. వీటిని కొనసాగించటానికి. అంతేకాక ఈసంవత్సరంలో మరో 30 క్రొత్త కేంద్రాలను స్థాపించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.50 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 0.06 లక్ష మొత్తం ఈ జిల్లాలోని వైద్యశాలలకు అయ్యే ఖర్చు నిమిత్తం ప్రత్యేకించ బడింది

## దంతవైద్య కళాశాల, దంతవైద్య శాలలను ఏర్పాటు చేయటం

గతంలో ఏర్పాటు చేయబడిన దంత వైద్యశాలలను నిర్వహించటానికి, క్రొత్తవాటిని ఏర్పాటు చేయటానికి, హైదరాబాదులోని ఉస్మానియా వైద్య కళాశాలలో 1958-59 లో తెరవబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికిగాను ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతపు ప్రణాళికలో రు. 2.50 లక్షల మొత్తం. తెలంగాణా ప్రాంతపు ప్రణాళికలో రు 0.56 లక్ష–మొత్తం రు 3.06 లక్షలు కేటాయించబడినాయి. ఇందులో రు. 0.10 లక్ష మొత్తం వరంగల్లు జనరలు ఆసుపత్రిలో 1957-58 ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికిగాను ప్రత్యేకించబడింది.

## క్షయవ్యాధి నివారణోద్యమం

ఈ పథకంక్రింద రు 6 90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.00 లక్షలు తెలంగాణా ప్రణాళికలోను రు. 2.90 లక్షలు ఆంధ్ర ప్రణాళికలోను, కేటాయించబడినాయి. పై కేటాయింపులో నుండి రు. 0.20 లక్ష మొత్తం 1957–58 లో వరంగల్లులో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించటానికి, వరంగల్లులో 60 పడకలతో క్షయ వ్యాధి ఐసొలేషన్ వార్డు"ను ఏర్పాటు చేయటానికిగాను కేటాయించ బడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలో జనాభా త్వరిత గతిని పెరిగిపోతూ దేశంయొక్క పరిమిత సాధన సంపత్తి మీద అధిక ఒత్తిడిని కలుగచేస్తున్నది. ఈ విషయాల దృష్ట్యా దేశంలో కుటుంబ నియంత్రణకు. జనాభా పెరుగుదలను అరికట్టే విషయాలకు ప్రాధాన్యం ఏర్పడింది 1957–59లలో ఆంధ్రలో 13, తెలంగాణాలో 7-మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 10 కేంద్రాలను ఆంధ్రలోను, 5 కేంద్రాలను తెలంగాణాలోను-మొత్తం 15 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకు ముందు ఏర్పాటు చేసిన వాటిని నిర్వహించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.66 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.02 లక్ష ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. మహబూబాబాదులో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికి, 1958-59 లో వరంగల్లులో స్థాపించబడిన కేంద్రాన్ని నిర్వహించటానికి గాను పై మొత్తం వినియోగించబడుతుంది.

## సుఖవ్యాధుల నివారణ కార్యక్రమం

తెలంగాణా ప్రాంతంలో సుఖవ్యాధుల నివారణ కార్యక్రమం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది. ఇందులో 0.01 లక్ష వరంగల్లులో స్థాపించబడిన సుఖవ్యాధి చికిత్సా కేంద్రం కొనసాగింపు కొరకు వినియోగించబడుతుంది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను ఆదుకొనటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ పథకంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 10.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 1.50 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. గతంలో స్థాపించబడిన కేంద్రాలు కొనసాగించబడతాయి.

# ప్రజారోగ్యం

## నేషనలు మలేరియా కంట్రోలు కార్యక్రమం

మలేరియా నివారణ కార్యక్రమంగా ఈ పథకం 1-4-1958 నుండి మార్చబడింది. ఈ పథకం క్రింద అన్ని జిల్లాలలోను తీవ్రంగా డి.డి.టి మొదలైన మందులు చల్లటం జరుగుతున్నది. ఈ సంవత్సరంలో 8½ హైపో-ఎండమిక్ యూనిట్లను ఏర్పాటు చేయడానికి, రెండు ప్రాంతీయ ప్రజారోగ్య అసిస్టెంటు డైరెక్టర్ల కార్యాలయాలను స్థాపించటానికి, ప్రస్తుతమున్న 3 మలేరియా నివారణ యూనిట్లను కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను తెలంగాణా ప్రాంతపు ప్రణాళికలో రు. 12.30 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.87 లక్షల మొత్తం ఈ జిల్లాలో ప్రస్తుతమున్న హైపో ఎండమిక్ యూనిట్లను కొనసాగించటానికిగాను ప్రత్యేకించబడింది.

## బలవర్ధక ఆహార పరిశోధన

అవిభక్త మదరాసు రాజ్యంలోని ఆంధ్ర ప్రాంతంలో ప్రాంతీయ బలవర్ధక ఆహార కేంద్రాన్ని 1950 లో స్థాపించడంతో బలవర్ధక ఆహార పరిశోధన పథకం అమలు ప్రారంభించ బడింది. క్రింది వర్గాల వారి ప్రస్తుత భోజన రీతుల్ని పరిశీలించడానికి, వారు తీసికొనే ఆహారంలో పుష్టి ఎంత కొరవడి ఉండేది నిర్ణయించడానికి, ఆహారంలో పుష్టి హీనతను పోగొట్టడానికి, పుష్టినిచ్చే పదార్థాలను సరఫరా చేయడానికి, బలవర్ధకాహారం గురించి ప్రజలకు తెలియ చేయడానికి ఈపథకం ఉద్దేశింప బడింది. 1956-57లో ఈ పథకం కొనసాగించ బడింది. అంతే కాకుండా విశాఖ పట్టణంలో బెరి బెరి వ్యాధి పరిశోధన పథకం కూడా ప్రారంభించ బడింది. ఇది భారతీయ వైద్య పరిశోధన వ్యవస్థ, పరిశోధనా సంస్థల సహకారంతో ప్రారంభించ బడింది. ఈ పరిశోధనా కేంద్రం ఇటీవల గుంటూరుకు మార్చబడింది. 1957-58లో కర్నూలులో ప్రధాన కార్యాలయంతో మరొక ప్రాంతీయ పరిశోధనా కేంద్రం ప్రారంభించబడింది. ఆంధ్ర ప్రాంతంలోని గుంటూరు, కర్నూలులలో ప్రస్తుతం పనిచేస్తున్న రెండు కేంద్రా

లను. గుంటూరులో ఉన్న బెరి బెరి పరిశోధన కేంద్రాన్ని, 1957-58లో తెలంగాణా ప్రాంతంలోని వరంగల్లులో స్థాపించబడిన కేంద్రాన్ని కొనసాగించడానికి 1959-60 ప్రణాళికలో రూ. 1.14 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.30 లక్ష మొత్తం ఈ జిల్లాలో ప్రస్తుతం ఉన్న బెరిబెర్ధ కాహార కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించబడింది.

## దాయీలకు శిక్షణ

ఈ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో నాటు మంత్రసానుల (దాయీలు) కు శిక్షణ ఇవ్వటానికి సంబంధించిన పథకాన్ని ప్రవేశ పెట్టటానికి. 240 మంది దాయీలకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 0.12 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో 60 మంది దాయీలకు రు 0.03 లక్ష ఖర్చుతో ఈ జిల్లాలో శిక్షణ ఇవ్వబడుతుంది.

## గ్రామాలకు మందుల పెట్టెల సరఫరా

ఈ పథకం క్రింద జిల్లాకు 12 చొప్పున 108 మందుల పెట్టెలు తెలంగాణా ప్రాంతంలో 1957_58, 1958_59 సంవత్సరాలలో సరఫరా చేయబడ్డినాయి. ఈ 108 మందుల పెట్టెలకు మందులు సరఫరా చేయటానికి, ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సరఫరా చేయబడిన 797 పెట్టెలకు కూడ మందులను సరఫరా చేయటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.91 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు 1957_59 లలో సరఫరా చేయబడిన 12 పెట్టెలకు. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సరఫరా చేయబడిన 96 పెటెలకు మందులు సరపరా చేయటానికిగాను పై మొత్తంలో రు 0.0764 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది.

## విద్యార్థి ఆరోగ్య కేంద్రాలు

రెండు విద్యార్థి ఆరోగ్య కేంద్రాలను స్థాపించటానికి. యింతేకాక ప్రస్తుతమున్న నాలుగు కేంద్రాలను కొనసాగించటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.60 లక్ష

యీ జిల్లాలో ప్రస్తుతమున్న కేంద్రాన్ని కొనసాగించటం కోసం వినియోగించ బడుతుంది.

## కుటుంబ సంక్షేమ కేంద్రాలు

1959_60 లో తెలంగాణా ప్రాంతంలోని గ్రామీణ ప్రాంతాల్లో 42 కుటుంబ సంక్షేమ కేంద్రాలు ఏర్పాటు చేయటానికి (ఇదులో 30 కేంద్రాలు 1957_59 సంవత్సరాలలో మంజూరు చేయబడినవి. 12 క్రొత్తగా ఏర్పాటు చేయ బడేవి), హైదరాబాదులోని సంక్షేమకేంద్రాన్ని కొనసాగించటానికి ప్రతిపాదించ బడింది ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.99 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 0.0833 లక్ష మొత్తం యీజిల్లాలో ప్రస్తుతమున్న మూడు కేంద్రాలను కొనసాగించటానికి, 2 క్రొత్త కేంద్రాలను స్థాపించటానికి గాను వినియోగించ బడుతుంది.

## ఆరోగ్య విద్యా ప్రచార పథకం

1959_60 సంవత్సరంలో ఈ పథకం క్రింద రు. 1.72 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.17 లక్ష 1957_58 లో జిల్లాలకు కేటాయించబడిన ఆరు ఎపిడమిక్ జీపుల నిర్వహణను కొనసాగించటానికి, రు. 0.83 లక్ష హైదరాబాదులోని హెల్త్ మ్యూజియంలో ఒక విభాగం యొక్క నిర్మాణం మొదలు పెట్టటానికి, రు. 0.72 లక్ష 16 మిల్లీమీటర్ల సౌండు ప్రొజెక్టర్లు కలిగి ఉండే రెండు ప్రచార వ్యానులను కొనడానికిగాను వినియోగించబడతాయి. ఇందులో రు. 0.38833 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ప్రస్తుతం ఈ జిల్లాలోఉన్న ఎపిడమిక్ జీపును కొనసాగించటానికి, 16 మిల్లీమీటర్ల సౌండు ప్రొజెక్టరు ఉండే ఒక ప్రచార వ్యానుకొనటానికి పై మొత్తం వినియోగించబడుతుంది.

## 50 మంది హెల్త్ అసిస్టెంట్లను నియమించటం

తెలంగాణా జిల్లాలలో టీకాలు వేసే కార్యక్రమానికిగాను నియమించబడిన హెల్త్ అసిస్టెంట్ల సంఖ్య చాలినంతగాలేదు. ఇందువల్ల ఈ సంవత్సరంలో

అదనంగా 50 మంది హెల్త్ అసిస్టెంట్లను నియమించటానికి ప్రతిపాదించ బడింది. ఇందుకు రు. 0.82 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో 7 గురు హెల్త్ అసిస్టెంట్లు ఈ జిల్లాలో నియమించ బడతారు ఇందుకు రు. 0 1148 లక్ష వ్యయ మవుతుంది

## లీవ్ రిజర్వు హెల్త్ ఇనస్పెక్టరు పదవులను ఏర్పాటు చేయటం

ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలో 79 మంది రిజర్వు హెల్త్ ఇనస్పెక్టర్లు పని చేస్తుండగా తెలంగాణాలో 25 మంది మాత్రమే పనిచేస్తున్నారు. అంటు వ్యాధులు ప్రబలినప్పుడు, ప్రస్తుతం పనిచేస్తున్నవారు సెలవుమీద పోయినప్పుడు పని చేసేటందుకు ఈ సిబ్బంది తగినంతగా లేదు. ఈ కారణంగా 1959-60 లో తెలంగాణా ప్రాంతంలో ఇంకా 50 లీవు రిజర్వు హెల్త్ ఇనస్పెక్టర్ల పదవులను ఏర్పాటుచేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.08 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 15,120/-లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి. ఈ మొత్తంతో హెల్త్ ఇనస్పెక్టర్ల పదవులు ఏర్పాటు చేయబడతాయి.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటి సరఫరా మురుగు పారుదల పథకాలను అమలు జరుపుటకుగాను ఈ సంవత్సరంలో రు 102 446 లక్షల మొత్తం (రు. 82 446 లక్షల మొత్తం కేంద్ర ప్రణాళికక్రింద. రు. 20 00 లక్షల మొత్తం రాజ్య ప్రణాళికక్రింద) ఋణ సహాయంగా భారత ప్రభుత్వం ఇస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.27 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది మిగత మొత్తంలో రు. 3.478లక్షల మొత్తం యీ జిల్లాలో క్రింది విధంగా ఖర్చుపెట్టబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (వేల రూపాయలలో) |
|---|---|---|
| 1. | వరంగల్లు నీటి సరఫరా పథకం | 3.478 |

# గృహ వసతి

## పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం

ఈ పథకం క్రింద భారత ప్రభుత్వం వారు చేసే ఆర్థిక సహాయంతో పారిశ్రామిక కార్మికులకు గృహ వసతిని కలిగించేటందుకు గాను హైదరాబాదు నగరంలోని చిక్కడపల్లి, సీతాఫలమండి, అంబరుపేట కాలనీలలోను, వరంగల్లు, ఖమ్మం, నిజామాబాదు పట్టణాలలోను ఒక గది ఇళ్లు, రెండు గదుల ఇళ్లు నిర్మించ బడుతున్నాయి. పైన పేర్కొన్న స్థలాలలో పారిశ్రామిక కార్మికులకు గాను 665 ఇళ్లు నిర్మించే నిమిత్తం 1959-60 ప్రణాళికలో రు. 17.65 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 2.81 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యే కించ బడింది.

## తక్కువ ఆదాయంగల వర్గాల వారికి గృహనిర్మాణం

## ప్రభుత్వ రంగం

దేశంలో నివాస గృహాల కొరతను తీర్చే ఉద్దేశంతో భారత ప్రభుత్వంవారు తక్కువ ఆదాయం గల వర్గాలవారికి గృహాలను నిర్మించేటందుకు సంబంధించిన ఈ పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద నూటికి 80 వంతుల ఖర్చు ఋణం రూపంలో కేంద్ర ప్రభుత్వం ఇవ్వగా మిగత 20 వంతుల ఖర్చు రాజ్య ప్రభుత్వం వారు భరిస్తారు. హైదరాబాదు సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డు, సికిందరాబాదు టౌను ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు, జిల్లా మునిసిపాలిటీలు 267 ఇళ్ళను నిర్మించేటందుకుగాను ఈ సంవత్సరంలో రు. 20.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. జిల్లాల వారీగా కేటాయించ వలసిన డబ్బు విషయమై ఇంకా తుది నిర్ణయం తీసికోబడలేదు.

## మునిసిపలు రంగం

ఈ పథకం క్రింద తక్కువ ఆదాయం గల వర్గాల వారికి ఇళ్లు నిర్మించటం కోసం మునిసిపాలిటీలకు ఋణాలు ఇవ్వబడతాయి. 170 ఇళ్ళ నిర్మాణం కోసం 1959–60 ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. పై మొత్తం క్రింద చూపిన విధంగా ఋణాలుగా ఇవ్వబడుతుంది.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | మునిసిపాలిటీలు | 2.00 |
| 2. | హైదరాబాదు మునిసిపలు కార్పొరేషను. | 1.00 |
| 3. | సికిందరాబాదు మునిసిపలు కార్పొరేషను. | 1.00 |
| | మొత్తం. | 4.00 |

## సహకార రంగం

ఈ పథకం క్రింద తెలంగాణా ప్రాంతంలోని సహకార గృహ నిర్మాణ సంఘాల సభ్యులకు, అందును ముఖ్యంగా హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాల్లోని సభ్యులకు క్రొత్త ఇళ్ళను కట్టుకొనేటందుకుగాను దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరంలో 340 గృహాల నిర్మాణం నిమిత్తం ఋణాలు ఇచ్చేటందుకుగాను రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.20 లక్షల మొత్తం ఈ జిల్లాలో 20 ఇళ్ళ నిర్మాణం నిమిత్తం ప్రత్యేకించ బడింది.

# కార్మికులు-కార్మిక సంక్షేమం

## ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకంయొక్క లక్ష్యాలేవంటే :—

1. ఏతరగతి ఉద్యోగులు తక్కువగా ఉన్నారో సరిగా నిర్ణయించేటందుకు వీలుగా ఎంప్లాయిమెంటు ఆఫీసర్లకు యింకా ఎక్కువ వివరాలను అందచేయటం.

2. ఉద్యోగాల్లో చేరగోరేటటువంటి విద్యాభ్యాసం పూర్తిచేసిన యువకులకు, ఇతరులకు ఉద్యోగాలను గురించి ఉద్యోగావకాశాలను గురించి సలహాలు ఇవ్వటానికి సమాచారం అందచేయటం.

3. ఏదేని ఉద్యోగ సాధక కేంద్ర ప్రాంతంలోకాని లేక ఉద్యోగ అవకాశాలను నిర్ణయించటానికి నిర్ణయించబడిన ఏదేని ప్రత్యేక ప్రాంతంలో కాని ఉద్యోగాలకు సంబంధించి వచ్చే మార్పులను తెలిసికొనడానికి ఒక విధానాన్ని రూపొందించటం.

4. ప్రతి పరిశ్రమలోను, వృత్తిలోను సంభవించే ఉద్యోగ, నిరుద్యోగ విషయాలను గురించి ముందుగానే సూచించటం.

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలులలోని ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో ఈ పథకం 1957—58లో అమలు జరుపబడింది. వీటికి సంబంధించిన కేంద్ర యూనిట్టు హైదరాబాదులోని జాతీయ ఉద్యోగ సేవా కేంద్ర డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది కాకినాడ, గుంటూరు నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు ఈ పథకం 1958—59లో విస్తరింపచేయటం జరిగింది. విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలో ప్రయివేటు రంగాన్ని గురించి 1959—60లో పరిశీలించేటందుకు ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను జాతీయ ఉద్యోగ సేవా కేంద్ర డైరెక్టరేటులో ఉన్న కేంద్ర యూనిట్టు ఒక సీనియరు ఆఫీసరు పర్యవేక్షణలోకి తీసుకరాబడి పటిష్ఠం చేయబడుతుంది. పైన పేర్కొన్న సాధక కేంద్రాలలో కూడ అదనపు సిబ్బంది నియమించబడుతుంది. మిగతా సాధక కేంద్రాలు

ప్రతిదానిలోకూడ ఒక గుమస్తాను నియమించటంద్వారా వాటిని పటిష్టం చేయ టానికి ప్రతిపాదింపబడింది. ఈ పథకాన్ని అమలు పరచుటకుగాను అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద 1959–60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించబడింది. కేంద్ర ప్రభుత్వంకూడ రు. 0.47 లక్ష మొత్తం భరిస్తుంది. కేటాయించబడిన మొత్తం రు. 0.78 లక్షలో రు. 0.057 లక్ష మొత్తం ఈ జిల్లాకు సంబంధించిన కార్యక్రమమునకుగాను, వినియోగించ బడుతుంది.

## ఉద్యోగుల రాజ్య భీమా పథకం

కార్మికులకు మాత్రం వైద్య సౌకర్యాలను కలిగించే ఉద్దేశంతో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఈ పథకం 1955 లో అమలుజరుప బడింది. భారత ప్రభుత్వం వారి ప్రోత్సాహంతో 1957-58 లో ఈ పథకం క్రింది సౌకర్యాలను భీమాచేసిన కార్మికుల కుటుంబాలకు కూడ విస్తరింప చేయటానికి ప్రతిపాదింప బడింది. అయితే ఆ సంవత్సరంలో ఈ పథకాన్ని అమలుపరచటానికి వీలులేక పోయింది. ఈ పథకం క్రింద వైద్య సౌకర్యాలు రాజ్యంలో భీమాచేసిన కార్మి కుల కుటుంబాలకు 26-1-1959 తేదీ నుండి విస్తరింప చేయబడినాయి. నియమిత వేళల్లో మాత్రం పనిచేసే వైద్యాలయాలు చాల మట్టుకు పూర్తికాలపు వైద్యాల యాలుగా మార్చబడినాయి. ఈ పథకం క్రింద రు. 1 80 లక్షల మొత్తం కేటా యించ బడింది. ఇందులో రు. 0.18 లక్ష, భీమాచేసినవారి కుటుంబాలకు వైద్య సౌకర్యాలను విస్తరింప చేసే నిమిత్తం పూర్తి కాలపు వైద్యాలయాలను ఏర్పాటు చేయటానికి, నియమిత వేళల్లో మాత్రం పనిచేసే వాటిని పూర్తి కాలపు వైద్యా లయాలుగా మార్చటానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## కార్మిక సంక్షేమ కేంద్రాలు

కార్మిక వర్గాలకు చెందిన స్త్రీ పురుషులకు, పిల్లలకు వినోద సౌకర్యాలు కలిగించే ఉద్దేశంతో తెలంగాణా ప్రాంతంలో 2 'ఏ' తరగతి సంక్షేమ కేంద్రాలు, 3 'బి' తరగతి సంక్షేమ కేంద్రాలు 1958-59లో అద్దె భవనాల్లో ఏర్పాటు చేయ బడినాయి. ఈ కేంద్రాలకు వరంగల్లులో మినహా ఇతర ప్రదేశాలలో 1958-59

సం లోనే శాశ్వత భవనాలు కూడ నిర్మించ బడినాయి. ఈ సంవత్సరంలో ఇంతకు ముందు ఏర్పాటు చేసిన కేంద్రాలను కొనసాగించటమే గాక మరో 2, 'బి' తరగతి కేంద్రాలను ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ కేంద్రాలకు కూడ శాశ్వత భవనాలను నిర్మించటం ప్రారంభించ బడుతుంది, ఈ పథకం కోసం రు. 3.41 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.69 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ డబ్బుతో 1958-59 లో వరంగల్లులో స్థాపించ బడిన కేంద్రాన్ని కొనసాగించటం, ఆ కేంద్రం కోసం శాశ్వత భవనాలు నిర్మించటం జరుగుతుంది.

## కార్మిక విద్య

తెలంగాణా ప్రాంతంలో 500 మంది కంటె తక్కువగా కార్మికులను నియమించే ఫ్యాక్టరీలలో పూర్తి కాలపు ఉపాధ్యాయులను నియమించటం ద్వారా 1957-58, 1958-59 లలో 10 కార్మిక విద్యా తరగతులు ఏర్పాటు చేయ బడినాయి. ఈ సంవత్సరంలో ఈ తరగతులు కొనసాగించ బడతాయి. ఇంతే కాక మరో 4 తరగతులు ప్రారంభించ బడతాయి. వరంగల్లులోని ఫ్యాక్టరీ కోసం పై డబ్బులో రు. 0.012 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## గ్రంథాలయాల ఏర్పాటు

తెలంగాణా ప్రాంతంలోని ఫ్యాక్టరీలలో 1959-60 లో 15 గ్రంథాలయాలను ఏర్పాటు చేయటం కోసం ఈ పథకం క్రింద రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ గ్రంథాలయాలు ఎక్కడ స్థాపించాలన్న విషయంపై యింకా నిర్ణయంజరగలేదు.

## కార్మిక శాఖ విస్తరణ

రెండవ ప్రణాళికా కాలంలో ఎక్కువయి పోయిన కార్యకలాపాల దృష్ట్యా కార్మికశాఖలో అదనపుసిబ్బందిని నియమించటం అవసరమయింది. 1957-58లో 10 మంది అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టర్లు, ఒక సంక్షేమ కేంద్రాల సూపరింటెండెంటు తదితర సిబ్బందితోసహా నియమించబడినారు. 1958-59 లో మంజూరు

చేయబడిన నాల్గు అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టరు పదవులకుగాను రెండు పదవులు మాత్రం భర్తీ చేయబడినాయి. 1959-60 లో పై సిబ్బంది కొనసాగించబడుతుంది. అంతేకాక 10 మంది అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టర్లను, అవసరమైన ఇతర సిబ్బందిని నియమించటం జరుగుతుంది. ఒక జీపు, స్టేషను వాగనును కొని డ్రైవరును నియమించటానికి కూడ ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 1.64 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని ఇద్దరు లేబరు ఇనస్పెక్టర్లను, వారి సిబ్బందిని కొనసాగించటానికి గాను వినియోగించ బడుతుంది.

## వృత్తిపనివారికి శిక్షణ సౌకర్యాల విస్తరణ

### పారిశ్రామిక శిక్షణ కేంద్రం, వరంగల్లు

ఈ సంస్థ 1959 ఫిబ్రవరిలో ప్రారంభించబడింది. 250 మంది విద్యార్థులను చేర్చుకోవడనికి యీ సంస్థలో వీలుంది. 1959-60లో యిది కొనసాగించ బడుతుంది. ఇందుకుగాను రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో రు. 1.19 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇంతేకాక కేంద్ర ప్రభుత్వం తరఫున రు. 1.79 లక్షల మొత్తం కేటాయించబడింది. రు. 1.00 ఖర్చయ్యే అదనపు భవనాలను నిర్మించటానికి, రు. 0.83 లక్ష విలువచేసే పరికరాలు సమకూర్చటానికి కూడ ప్రతిపాదింప బడింది. ఇంతేకాక సిబ్బంది క్రింద ఖర్చు మొదలగు వాటికిగాను రు. 1.15 లక్షల మొత్తం ఖర్చు పెట్టడానికి కూడ ప్రతిపాదింప బడింది.

# వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు

### మంచినీటి బావులు

హరిజనులు నివసించే వాడలలో మంచినీటి సదుపాయాలు చాలా అరుదుగా ఉంటాయి. ఇందువల్ల ఈ జిల్లాలో 28 క్రొత్త బావులను త్రవ్వటానికిగాను

రు. 0.224 లక్ష, 30 పాతబావులను మరమ్మతు చేయటానికిగాను రు. 0.06 లక్ష కేటాయించబడినాయి.

## గృహ నిర్మాణం

ఆర్థికంగాను, సాంఘికంగాను హరిజనులు వెనుకబడి ఉన్న కారణంగా వారు ఇళ్ళను స్వంతంగా కట్టుకొనే స్థితిలో లేరు. వారు ఇళ్ళు కట్టుకునేందుకు ఇంటికి రు. 320 చొప్పున సబ్సిడీ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. సాధారణంగా నివేశన స్థలాలు కలిగి ఉండి ఇళ్ళు కట్టదలిచే హరిజనులకే సబ్సిడీలు ఇవ్వబడతాయి. తగిన సందర్భాల్లో నివేశన స్థలాలుకూడ ఉచితంగా ఇవ్వబడతాయి. ఈ జిల్లాలో నివేశన స్థలాలకోసం భూమినిస్వాధీనం చేసికోవటానికిగాను రు. 0.0202 లక్ష, 51 ఇళ్ళను కట్టే నిమిత్తం రు. 0.163 లక్ష 1959–60 ప్రణాళికలో కేటాయింపబడినాయి.

## విద్య

హరిజనులు చదువుకొనేటందుకు సహాయంచేసే నిమిత్తం సాంఘిక సేవకులు, స్వచ్ఛంద సంస్థలచేత కొన్ని ప్రయివేటు హాస్టళ్ళు నిర్వహించబడుతున్నాయి. ఈ సంస్థలను ప్రోత్సాహపరిచేటందుకు వాటికి సబ్సిడీలను ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క బోర్డరుకు విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున సబ్సిడీ ఇవ్వబడుతుంది. రు. 1.64 లక్షల మొత్తం వ్యయంతో హరిజనులకు ఇంకా 1093 బోర్డింగు గ్రాంటులను 1959–60 లో ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని హరిజన విద్యార్థులు కూడ ఈ పథకంవల్ల లాభం పొందుతారు.

దుస్తులు, పుస్తకాలు, పలకలు, విద్యావిషయిక పరికరాలు మొదలయినవి అర్హులైన బీద హరిజన విద్యార్థులకు సరఫరా చేయబడతాయి. ఇంతేకాక ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఒక్కొక్కరికి నెలకు రు. 5 లు లేక రు. 7 లు చొప్పున స్కాలరు షిప్పులు కూడ ఇవ్వబడతాయి. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలోని 350 మంది విద్యార్థుల ప్రయోజనం నిమిత్తం రు. 0.042 లక్ష మొత్తం కేటాయించబడింది. హరిజనుల కోసం

నిర్వహించబడే గ్రంథాలయాలకు కూడ ఈపథకం క్రింద చేయబడిన కేటాయిం పులో నుండి ఆర్థిక సహాయం చేయబడుతుంది.

## వైద్య సహాయం

క్షయ, కాన్సరు మొదలయినటువంటి ప్రమాద భరితమయిన వ్యాధులతో బాధపడుచున్న హరిజనులు చికిత్సపొందే నిమిత్తం ఆర్థిక సహాయం చేయడానికి ఈపథకం క్రింద ఉద్దేశించబడింది. ఒక్కొక్క రోగికి రు. 100 లు మొదలు కొని రు. 500 లు వరకు ఇట్టి సహాయం చేయబడుతుంది. 250 మంది రోగులకు ఆర్థిక సహాయం చేయటంకోసం 1959_60 సం.లో రు. 0.25 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.03 లక్ష ఈజిల్లాకు ప్రత్యేకించబడింది. 30 మంది రోగులకుగాను ఈ డబ్బు వినియోగించబడుతుంది.

## కుటీర పరిశ్రమలు

చేతి పనులు చేసుకునే పనివారికి తమ వ్యాపారానికి లేక చేతిపనికి సహా యం చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పనివారు వ్యక్తిగతంగా గాని సహకార సంఘాల ద్వారాగాని ఈ సహాయాన్ని పొందవచ్చును. పరికరాలను సమకూర్చుకోవడానికి, ముడి సామగ్రికొనుక్కోవటానికి, నిర్వహణ మూలధనం క్రింద ఈ సహాయం ఇవ్వబడుతుంది. 1959_60లో 33 సంఘాలకు రు. 0.33 లక్ష మేరకు సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందులో ఈ జిల్లాలోని 4 సంఘాలకు రు. 0.04 లక్ష మేరకు సహాయం చేయబడుతుంది.

## ప్రచారం

అస్పృశ్యతను పాటించడం వలన కలిగే హానిని గురించి వివరించేటందుకు అస్పృశ్యతను నిర్మూలించేటందుకు ప్రచారం చేసే నిమిత్తం గ్రామీణ ప్రాంతాల్లో ఫిల్ములు, స్లయిడులను ప్రదర్శించటానికి, కరపత్రాలు జారీచేయటానికి, అంతర్వర్ణ భోజనాలు ఏర్పాటు చేయటానికి, హరిజన దినోత్సవాలు, మేలాలు, జరపటానికి గాను 1959_60 ప్రణాళికలో రు. 0.17 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోకూడ ప్రచార కార్యక్రమం నిర్వహించబడుతుంది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం (గ్రాంటు-ఇన్-ఎయిడ్)

హరిజన సేవక సంఘం, భారత సేవక సమాజం, ఆది హిందూలీగు మొదలయినటువంటి స్వచ్ఛంద సంస్థలు అస్పృశ్యత నివారణ కోసం మంచి కృషి చేస్తున్నాయి. ఈ సంస్థల ద్వారా మంచి ప్రచారం కొనసాగించే నిమిత్తం వీటికి రు. 0 127 లక్ష దాకా 1959—60 లో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలకు కూడ ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## లీగల్ ఎయిడ్, గ్రాంటు-ఇన్-ఎయిడ్

న్యాయ విషయాలలో సహాయం చేసేటందుకు లేక వరదలు, అగ్ని తదితర ప్రకృతి భీభత్సాలకు గురి అయిన వ్యక్తులకు సహాయం చేసే నిమిత్తం 1959_60 లో రు. 0·16 లక్ష మొత్తం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.02 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఇందువల్ల 40 మంది ప్రయోజనం పొందుతారు.

## సామాజిక మందిర నిర్మాణం

హరిజనుల సాంఘిక, సాంస్కృతిక జీవనాన్ని మెరుగు పరచే ఉద్దేశంతో ఒక సామాజిక మందిరాన్ని నిర్మించటానికి 1959_60 లో రు. 0.01 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## విముక్తజాతులు

### విద్య

విముక్త జాతులకు చెంది ఉన్నత, మాధ్యమిక, ప్రాథమిక పాఠశాలలలో విద్యను అభ్యసిస్తున్న విద్యార్థులకు వరుసగా రు. 7 లు, రు. 5 లు చొప్పున స్కాలరు షిప్పులు ఇవ్వటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. స్కాలరు షిప్పులు ఇవ్వటానికిగాను రు. 0.305 లక్ష, 4 కొత్త పాఠశాలలను ప్రారంభించటానికిగాను రు. 0.02 లక్ష, హాస్టళ్లకు సహాయం చేసే నిమిత్తం రు 0 306 లక్ష

ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి గాను కేటాయించ బడినాయి. ఈ జిల్లాకు చెందిన విముక్త జాతుల విద్యార్థులకు కూడ ఈపథకం క్రింద లాభం చేకూరుతుంది. విముక్త జాతులవారి హాస్టళ్ళకుకూడ ఈ పథకంక్రింద ప్రయోజనం చేకూరుతుంది.

## వ్యవసాయం

బంజారీలను వ్యవసాయంలో స్థిర పరచాలంటే వారికి నాగళ్ళు, ఎద్దులు, విత్తనాలు, పరికరాలు మొదలైనవి సరఫరా చేయటం ద్వారా సహాయం చేయటం అవసరం. 1959-60 లో ఈ జిల్లాలోని 19 కుటుంబాలకు రు. 0.075 లక్ష వ్యయంతో 27 జతల కాడిఎద్దులను, విత్తనాలను పరికరాలను సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది

## కుటీర పరిశ్రమలు

విముక్త జాతులవారు తమ కుటీర పరిశ్రమల్ని అభివృద్ధి పరచుకొనేటందుకు రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో ఈ పథకం క్రింద 14 సహకార సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ చేతిపని వారి యొక్క ప్రయోజనం నిమిత్తం ఈ సంవత్సరంలో అదనంగా 13 సహకార సంఘాలను ఏర్పాటు చేయటానికి ప్రణాళికలో రు. 0.13 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో రు. 0.01 లక్ష వ్యయంతో ఒక సంఘం యీ జిల్లాలో ఏర్పాటు చేయబడుతుంది.

## ప్రజారోగ్యం

విముక్త జాతుల వారికి మంచినీటి బావులను త్రవ్వించి పరిశుభ్రమైన నీటి సరఫరా చేయటం ఎంతైనా అవసరం. ఇందువల్ల ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష రెండు క్రొత్త బావులను త్రవ్వటానికి, రెండు పాత బావులను మరమ్మత్తు చేయటానికిగాను కేటాయించ బడింది.

# ఇతర వెనుకబడిన తరగతులు.

## వి ద్య

### (ఎ) స్కాలరు షిప్పుల మంజూరు.

హరిజనులు, విముక్త జాతులవారే కాక ఇతర వెనుకబడిన తరగతుల వారిలో కూడ చాల వెనుకబడి సహాయం అవసరమైనట్టి వారు చాలమంది ఉన్నారు. ఈ జాతులకు చెంది ప్రాథమిక, మాధ్యమిక, హెచ్.ఎస్.సి. తరగతులలో చదువుకొంటున్న విద్యార్థులకు రు. 5 లు లేక 7 లు చొప్పున స్కాలరు షిప్పులు ప్రతి సంవత్సరం ఇవ్వబడుతున్నాయి. 1959-60 ప్రణాళికలో రు. 0.217 లక్ష మొత్తం యీ జిల్లాలో 362 స్కాలరు షిప్పులు ఇవ్వటానికిగాను కేటాయించ బడింది.

### (బి) ప్రయివేటు హాస్టళ్ళకు సహాయం

సంక్షేమ కార్యక్రమంలో ఆసక్తి ఉన్న కొన్ని స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తులు వెనుకబడిన తరగతులవారి కోసం హాస్టళ్ళు నడపటానికి ముందుకు వస్తున్నారు కొత్త హాస్టళ్ళను నడిపేటందుకుగాను వారికి ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.054 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందువల్ల 703 మంది బోర్డర్లకు లాభం చేకూరుతుందని ఆశించబడుతున్నది. ఈ జిల్లాకు చెందిన స్వచ్ఛంద సంస్థలకు, వ్యక్తులకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

### (సి) క్రొత్త హాస్టళ్ళను ప్రారంభించటం.

విద్యా సంస్థలకు అనుబంధించబడిఉన్న హాస్టళ్లు వెనుకబడిన విద్యార్థుల అవసరాలను పూర్తిగా తీర్చలేక పోతున్నందు వల్ల తెలంగాణా ప్రాంతంలో తగిన ప్రదేశాల్లో కొన్ని ప్రభుత్వ హాస్టళ్ళను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించ బడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.62 లక్ష మొత్తం కేటా. యించబడింది. ఈ హాస్టళ్లు ఎక్కడ స్థాపించాలనే విషయం ఇంకా నిర్ణయించ బడలేదు.

## కుటీర పరిశ్రమలు

ఈ పథకం క్రింద పనివారల పిల్లలు వడ్రంగం, కమ్మరి పని మొదలయిన కోర్సులను పరిశ్రమల శాఖచే నడుపబడే గుర్తించబడిన సంస్థలలో చదివేటందుకుగాను ఆ పిల్లలకు స్టయిఫండులు మంజూరు చేయబడుతున్నాయి. 1959-60లో 18 మంది పనివారల పిల్లలకు స్టయిఫండులు ఇచ్చే నిమిత్తం రు. 900 లు కేటాయించబడినాయి. ఈ జిల్లాలోని 3 సహకార సంఘాలకు వాటా మూలధనం క్రింద రు. 0.03 లక్ష వరకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ప్రతిపాదింపబడింది.

## ఇతర సంక్షేమ కార్యక్రమాలు

ఈ పథకం క్రింద, బీదలు, అనాథులయిన బాలురకు, బాలికలకు రక్షణ కల్పించటానికి, అవసరమయిన సందర్భాల్లో వారికి విద్యా సౌకర్యాలు కలిగించటానికి ప్రతిపాదింప బడింది. వరంగల్లులో 80 మందితో ఒక బిక్షుక గృహాన్ని 1959-60లో రు. 0.40 లక్ష అంచనా వ్యయంతో ప్రారంభించటానికి ప్రతిపాదింప బడింది. ఇక్కడ ఉండే వారికి చేతి పనులలో కూడ శిక్షణ యివ్వబడుతుంది.

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

## విద్య

### స్కాలరుషిప్పుల మంజూరు

ప్రైమరీ. లోయర్. హైయ్యర్ సెకండరీ తరగతులలో చదువుకొనే తెలంగాణా ప్రాంతపు కొండతెగల బాలురకు సంవత్సరంలో పది నెలలపాటు స్కాలరు షిప్పులు యివ్వబడతాయి. ప్రైమరీ తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు నెలకు రు. 2లు చొప్పున, హైయ్యరు సెకండరీ తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు నెలకు రు 5/- చొప్పున స్కాలరుషిప్పులు యివ్వబడతాయి. 1959-60లో రు. 0.125 లక్ష వ్యయంతో యీ జిల్లాలో 613 స్కాలరుషిప్పులు యివ్వటానికి ప్రతిపాదింపబడింది,

## ట్రయిబలు హాస్టళ్ళను ప్రారంభించటం

ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాలకు చెందిన కొండ తెగల విద్యార్థులకు భోజన వసతి సౌకర్యాలు కలిగించేటందుకుగాను ఒక హాస్టలు ప్రారంభించ బడింది రు. 0.086 లక్ష వ్యయంతో ఈ సంవత్సరంలో కొనసాగించబడు తుంది.

## ప్రయివేటు హాస్టళ్ళు

కొండతెగల విద్యార్థులకు భోజన, వసతి సౌకర్యాలు కల్పించటంకోసం యీ పథకంక్రింద ప్రయివేటు హాస్టళ్ళకు గ్రాంటు-ఇన్-ఎయిడ్ (ఆర్థిక సహాయం) యివ్వబడుతుంది. సంవత్సరంలో 10 నెలలపాటు ప్రతి విద్యార్థికి రు. 25/- ల చొప్పున యీ సహాయం చేయబడుతుంది. ప్రయివేటు హాస్టళ్ళు లేని సందర్భాలలో యీ డబ్బు ప్రభుత్వ హాస్టళ్ళలో బోర్డర్ల సంఖ్య పెంచుటకు వినియోగించబడుతుంది. 1959-60లో యీ పథకంకోసం రు. 0'05 లక్ష కేటాయించబడింది.

# వ్యవసాయం

## ప్రదర్శన క్షేత్రాలు

వ్యవసాయంలో ఆధునిక పద్ధతుల్ని గురించి కొండ తెగల ప్రజలకు ప్రదర్శన పూర్వకంగా తెలియ చేయటం కోసం ఒక ప్రదర్శన క్షేత్రం యీజిల్లాలోని ఏజన్సీ ప్రాంతాలలో ఏర్పాటు చేయబడింది. రు. 0. 0465 లక్ష వ్యయంతో 1959-60 సం. లో యిది కొన సాగించ బడుతుంది.

## కాడి ఎద్దుల సరఫరా

శాశ్వతంగా వ్యవసాయంలో కొండతెగలవారిని స్థిరపరచేటందుకుగాను ఉచితంగా వారికి కాడిఎద్దుల సరఫరా చేయబడు తున్నాయి. ఈ సంవత్సరంలో

యీ జిల్లాలో 34 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## విత్తనాలు, పరికరాల సరఫరా

కొండజాతులవారు వ్యవసాయాన్ని చేపట్టేటందుకు ప్రోత్సహించే నిమిత్తం విత్తనాలు, పరికరాలు మొదలయినవి ఉచితంగా తెలంగాణాలోని అర్హమైన కొండతెగల కుటుంబాలకు సరఫరా చేయబడుతున్నాయి. 1959–60 లో రు. 0.01 లక్ష వ్యయంతో యీ జిల్లాలోని 20 కుటుంబాలకు విత్తనాలు, పరికరాలు సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది.

## గొర్రెలు, పాడిబర్రెల సరఫరా

తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకొనేటందుకుగాను కొండతెగల ప్రజలకు యీ పథకంక్రింద గొర్రెలు, పాడిబర్రెలు ఉచితంగా సరఫరా చేయబడతాయి. 67 గొర్రెలు, 12 పాడిబర్రెలు సరఫరా చేయటంకోసం 1959–60 లో యీ జిల్లాకు రు. 0.05 లక్ష మొత్తం కేటాయించబడింది. ప్రతి కొండతెగ కుటుంబానికి ఒక పాడిబర్రెకాని లేక 5 గొర్రెలుకాని యివ్వబడతాయి.

## రోడ్ల నిర్మాణం

ట్రైబలు ప్రాంతాల్లో రవాణా సౌకర్యాలు పెంపొందించేనిమిత్తం క్రొత్తరోడ్లను నిర్మించటానికి, ప్రస్తుతమున్నవాటిని మరమ్మతుచేసి నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను యీ జిల్లాకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గిరిజన వారోత్సవము

గిరిజనులు అధికారులతోను, మైదానప్రాంతాలలోని ప్రజలతోను సంబంధాలను కలిగించుకొనేటట్లు చేసే ఉద్దేశంతో 1959–60 లో గిరిజన వారోత్సవం జరపటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.02 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

### క్రొత్త బావుల త్రవ్వకం, పాతబావులకు మరమ్మతు

కొండతెగల ప్రజలకు మంచినీటి సౌకర్యాన్ని కలిగించే ఉద్దేశంతో యీ జిల్లాకు రు. 0.094 లక్ష కేటాయించబడింది. ఈ మొత్తంతో 10 క్రొత్త బావులు త్రవ్వబడతాయి. 3 పాతబావులు మరమ్మతు చేయబడతాయి.

# స్త్రీ సంక్షేమం

### స్త్రీ సంక్షేమశాఖ విభాగాల ఏర్పాటు

తెలంగాణా ప్రాంతంలో స్త్రీ సంక్షేమ శాఖ కార్య కలాపాలను విస్తృతం చేసే ఉద్దేశంతో స్త్రీలు, పిల్లల సంక్షేమం నిమిత్తం 1959–60లో 10 స్త్రీ సంక్షేమ శాఖ విభాగాలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రెండు విభాగాలు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడతాయి. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.068 లక్ష కేటాయించబడింది.

# సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ఈ పథకంక్రింద అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరానికిగాను రు. 0.129 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని మొదటిదశ బ్లాకు ప్రాంతంలో సమన్వయ పద్ధతిలో ఒక సంక్షేమ కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది. ఈ అదనపు కేంద్రానికయ్యే ఖర్చు 5: 12: 6 నిష్పత్తిలో బ్లాకులు, కేంద్రి సాంఘిక సంక్షేమ

యీ జిల్లాలో 34 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## విత్తనాలు, పరికరాల సరఫరా

కొండజాతులవారు వ్యవసాయాన్ని చేపట్టేటందుకు ప్రోత్సహించే నిమిత్తం విత్తనాలు, పరికరాలు మొదలయినవి ఉచితంగా తెలంగాణాలోని అర్హమైన కొండతెగల కుటుంబాలకు సరఫరా చేయబడుతున్నాయి. 1959–60 లో రు. 0.01 లక్ష వ్యయంతో యీ జిల్లాలోని 20 కుటుంబాలకు విత్తనాలు, పరికరాలు సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది.

## గొర్రెలు, పాడిబర్రెల సరఫరా

తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకొనేటందుకుగాను కొండతెగల ప్రజలకు యీ పథకంక్రింద గొర్రెలు, పాడిబర్రెలు ఉచితంగా సరఫరా చేయబడతాయి. 67 గొర్రెలు, 12 పాడిబర్రెలు సరఫరా చేయటంకోసం 1959–60 లో యీ జిల్లాకు రు. 0.05 లక్ష మొత్తం కేటాయించబడింది. ప్రతి కొండతెగ కుటుంబానికి ఒక పాడిబర్రెకాని లేక 5 గొర్రెలుకాని యివ్వబడతాయి.

## రోడ్ల నిర్మాణం

ట్రియిబలు ప్రాంతాల్లో రవాణా సౌకర్యాలు పెంపొందించేనిమిత్తం క్రొత్తరోడ్లను నిర్మించటానికి, ప్రస్తుతమున్నవాటిని మరమ్మతుచేసి నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను యీ జిల్లాకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గిరిజన వారోత్సవము

గిరిజనులు అధికారులతోను, మైదానప్రాంతాలలోని ప్రజలతోను సంబంధాలను కలిగించుకొనేటట్లు చేసే ఉద్దేశంతో 1959–60 లో గిరిజన వారోత్సవం జరపటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.02 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

### క్రొత్త బావుల త్రవ్వకం, పాతబావులకు మరమ్మతు

కొండతెగల ప్రజలకు మంచినీటి సౌకర్యాన్ని కలిగించే ఉద్దేశంతో యీ జిల్లాకు రు. 0.094 లక్ష కేటాయించబడింది. ఈ మొత్తంతో 10 క్రొత్త బావులు త్రవ్వబడతాయి. 3 పాతబావులు మరమ్మతు చేయబడతాయి.

# స్త్రీ సంక్షేమం

### స్త్రీ సంక్షేమశాఖ విభాగాల ఏర్పాటు

తెలంగాణా ప్రాంతంలో స్త్రీ సంక్షేమ శాఖ కార్య కలాపాలను విస్తృతం చేసే ఉద్దేశంతో స్త్రీలు, పిల్లల సంక్షేమం నిమిత్తం 1959_60లో 10 స్త్రీ సంక్షేమ శాఖ విభాగాలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రెండు విభాగాలు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడతాయి. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.068 లక్ష కేటాయించబడింది.

# సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ఈ పథకంక్రింద అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరానికిగాను రు. 0.129 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోవి మొదటిదశ బ్లాకు ప్రాంతంలో సమన్వయ పద్ధతిలో ఒక సంక్షేమ కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది. ఈ అదనపు కేంద్రానికయ్యే ఖర్చు 5: 12: 6 నిష్పత్తిలో బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమ

బోర్డువారు, రాజ్య ప్రభుత్వం భరిస్తారు. ప్రజలనుండి వసూలు చేయబడే విరాళాలుకూడా ఇందుకుగాను వినియోగించ బడతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్సు నుండి విడుదల చేయబడే స్త్రీలకుగాను రాజ్య స్థాయిలో ఒక ఆశ్రియ కేంద్రాన్ని, 14 జిల్లా ఆశ్రియ కేంద్రాలను (పురుషులకు 3 స్త్రీలకు 11) ఏర్పాటు చేయ్యటానికి, రాజ్యంలో ఇంతకు ముందు ఏర్పాటు చేయబడిన రాజ్య ఆశ్రియ కేంద్రాలను. జిల్లా ఆశ్రియ కేంద్రాలను కొన సాగించడానికి అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద, ప్రణాళికలో రు. 6 32 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0 153 లక్ష మొత్తంతో స్త్రీలకు గాను ఒక జిల్లా ఆశ్రియ కేంద్రం ఈజిల్లాలో ఏర్పాటు చేయ బడుతుంది. ఇంతేకాక "కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్స్" నుండి విడుదల చేయబడిన పురుషులకుగాను ఉన్న ఒక "స్టేట్ హోమ్" కొన సాగించబడుతుంది.

## భిక్షుక గృహం

ఈ జిల్లాలో ఒక బిక్షుక గృహాన్ని ఏర్పాటు చేయటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0 30 లక్ష గ్రాంటు-ఇన్-ఎయిడ్ పథకం క్రింద కేటాయించ బడింది. ఈ బిక్షక గృహంలో చేర్చుకో బడేవారికి ప్రాథమిక విద్య గరప బడుతుంది. పాద రక్షలు తయారు చేయటం, వ్రడగం, నేతపని, దర్జీపని మొదలయిన వాటిలో వీరికి శిక్షణ కూడ యివ్వబడుతుంది భోజన, వైద్య సౌకర్యాలు కూడ సమకూర్చ బడతాయి.

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియో సెట్లను స్థాపించటం

ఈ జిల్లాలో 225 కమ్యూనిటీ రేడియో సెట్లను స్థాపించడానికి ప్రతిపాదింప బడగా అందులో 50 సెట్లను మాత్రం 1956-59 సంవత్సరాలలో స్థాపించడం

జరిగింది. ఈసంవత్సరంలో 50 కమ్యూనిటీ రేడియో సెట్లను ఏర్పాటుచేసి నిర్వహించటానికి ప్రతిపాదించబడింది. ఇంతేగాక 1-4-1959 తేదీకి పూర్వం స్థాపించబడిన సెట్లనుకూడ నిర్వహించటానికి ప్రతిపాదించబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.100 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా అమలు పరచటంలో ప్రజలు శ్రద్ధ వహించేటట్టు చేయటానికి, వారు సంపూర్ణంగా సహకరించి పాల్గొనేటట్లు చేయటానికిగాను వివిధ పద్ధతుల్లో అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారం చేయటానికి ఏకీకృత కార్యక్రమం ఒకటి 1956-57లో ప్రారంభించబడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 44, 877 లు మొత్తం ఈ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించటానికిగాను ప్రత్యేకించబడింది.

| | | రూపాయలు. |
|---|---|---|
| 1. | పి. ఎ. లకు ఇతర సిబ్బందికి జీతభత్యాలు | 5,987 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోల్, ఇతర ఖర్చులు | 1,200 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలలో పాల్గొనటానికి | 250 |
| 4. | సంగీత, నాటకోత్సవాలు ఏర్పాటు చేయడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళిక వారోత్సవాల ఏర్పాటు చేయటానికి | 900 |
| 6. | జిల్లాల్లో పనిచేస్తున్న బుర్రకథ పార్టీల నిర్వహణకు | 2,280 |

| | | |
|---|---|---|
| 7. | ప్రస్తుతమున్న పబ్లిక్ గ్రంథాలయాలలో పైలట్ ప్రాతి పదికపై సమాచార కేంద్రాలను నిర్వహించటం | 960 |
| 8. | సంచార వ్యానులకు పరికరాలు | 32,800 |
| | మొత్తం. | 44,877 |

# అర్థ, గణాంక శాఖ

రాజ్యస్థాయిలో జరిగే గణాంక వివరాల సంకలన కార్యక్రమాన్ని జిల్లా స్థాయిలో సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలను ఇంకా ఉత్తమంగా తయారు చేయడానికి ఉపయోగపడే "లయజన్ ఏజెన్సీ"గా పనిచేయటానికిగాను ఈజిల్లాలో ఒక జిల్లా గణాంక విభాగం 1957-58 లో ఏర్పాటుచేయబడింది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజను గుమస్తా, ఇద్దరు జవానులు ఈ శాఖలో నియమించబడినారు. ఈ సిబ్బంది ఈ సంవత్సరం కూడ కొనసాగించబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో 0.10 లక్ష కేటాయించ బడింది.

# తంతి తపాలా సౌకర్యాలు

1959-60లో 4 బ్రాంచి పోస్టు ఆఫీసులను ఏర్పాటు చేయటమేగాక వరసంపేట, పార్కల్లులలో రెండు టెలిగ్రాఫ్ ఆఫీసులను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించబడింది. మహబూబాబాదులో ఒక టెలిఫోను ఎక్స్చేంజిని ఏర్పాటు చేయటానికి కూడ ప్రతిపాదింప బడింది.

# రైలు మార్గాలు

వరంగల్లు జిల్లాకు సంబంధించి 1959_60 లో క్రింది రైల్వే పనులు నిర్వహించబడతాయి.

| వరుస సంఖ్య | పని పేరు | అంచన వేయబడిన ఖర్చు. వేల రూపాయిలలో |
|---|---|---|
| 1. | నెకొండ–కేశ ముద్రింల మధ్య క్రాసింగు స్టేషను ఏర్పాటు చేయటం | 500 |
| 2. | 12 యూనిట్ల ఒకటవ శ్రైపు, 5 యూనిట్ల రెండవ శ్రైపు, 4 యూనిట్ల మూడవ శ్రైపు అవసపు సిబ్బంది గృహాలను కాజీపేటలో నిర్మించటం. | 134 |

# వరంగల్లు జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం సభ్యుల జాబితా

కలెక్టరు ..................... అధ్యక్షుడు.

శ్రీ కె. రామేశ్వరరావు ............... ఉపాధ్యక్షుడు

జిల్లా ప్లానింగు ఆఫీసరు ............ పదవిరీత్యా కార్యదర్శి

## అధికార సభ్యులు

1. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. (ఆర్. & బి). వరంగల్లు.
2. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పి డబ్ల్యు. డి. (ఐ&బి.). వరంగల్లు.

3. డివిజనల్ ఫారెస్టు ఆఫీసరు, వరంగల్లు

4. జిల్లా వ్యవసాయ శాఖాధికారి, వరంగల్లు

5. సహకారసంఘాల డిప్యూటీరిజిస్ట్రారు, వరంగల్లు

6. జిల్లా వైద్య శాఖాధికారి. వరంగల్లు

7. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, వరంగల్లు

8. జిల్లాపశువైద్య శాఖాధికారి, వరంగల్లు

9. జిల్లా పంచాయతి ఆఫీసరు, వరంగల్లు

10. జిల్లా పంచాయతి ఆఫీసరు, వరంగల్లు

11. పరిశ్రమలు, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, వరంగల్లు

12. స్పెషల్ సోషల్ సర్వీస్ ఆఫీసరు, వరంగల్లు

13. అసిస్టెంటు ఫిషరీస్ ఆఫీసరు, వరంగల్లు

14. సబ్ కలెక్టరు, వరంగల్లు.

15. డిప్యూటి కలెక్టరు, మహబూబాబాదు

16. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, ఎమ్. ఐ. పి., వరంగల్లు

17. కమ్యూనిటీ ప్రాజెక్టు ఎక్జిక్యూటివ్ ఆఫీసరు (ఇండస్ట్రీస్) ములుగు

18. జిల్లా గణాంకాధికారి, వరంగల్లు

19. ఎక్జిక్యూటివ్ ఆఫీసరు (సిటీమునిసిపాలిటి) వరంగల్లు

20. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, వరంగల్లు

21. అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగు) వరంగల్లు

22. అసిస్టెంటు ఇంజనీరు (బిల్డింగ్స్) వరంగల్లు

23. అసిస్టెంటు ఉమన్ వెల్ ఫేర్ ఆఫీసరు, వరంగల్లు

24. ప్రాజెక్టు ఎక్జిక్యూటివ్ ఆఫీసరు, నర్సంపేట

25. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, ములుగు

26. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, మహబూబాబాదు

27. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, పార్కాల్

27. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, సంగం

29. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, కొడకొండ్ల

30 బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, వార్ధన్న పేట

31. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, జనగాం

32. బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరు, ఆబ్బాయపాలెం

32. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (విద్యుచ్ఛక్తి) వరంగల్లు

## అనధికార సభ్యులు

34. శ్రీ సాదత్ అలీఖాన్ ఎం. పి వరంగల్లు

35. శ్రీ ఇ. మధుసూదన్ రావు. ఎం. పి., మహబూబాబాదు

36. శ్రీ జె. రఘోత్తంరెడ్డి. ఎం. ఎల్. సి. వరంగల్

37. శ్రీ ఇ. లక్ష్మారెడ్డి ఎం. ఎల్. సి., వరంగల్

38. శ్రీ కె మనోహర్ రావు, ఎం. ఎల్. సి. వరంగల్లు

39. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, ఎం. ఎల్. ఎ. దోర్నకల్

40. శ్రీ ఎం. ఎస్. రాజలింగం, ఎం ఎల్. ఎ. చిలంచెర్ల

41. శ్రీ బి. కేశవరెడ్డి, ఎం. ఎల్. ఎ. షంపూర్

42. శ్రీమతి కే. కనకరత్నమ్మ, ఎం. ఎల్. ఎ. నరసంపేట

43. శ్రీ రాజేశ్వరరావు. ఎం. ఎల్. ఎ. ములుగు

44. శ్రీ మద్న సాయిలు. ఎం. ఎల్. ఎ. పార్కాల్

45. శ్రీ మిర్జాషకూర్‌బేగ్, ఎం. ఎల్. ఏ. వరంగల్

45. శ్రీ టి. హయగ్రీవాచారి, ఎం. ఎల్. ఎ. ధర్మసాగర్

47. శ్రీ ఇ వెంకటరామ నరసయ్య, ఎం. ఎల్. ఎ., వార్ధన్నపేట

48. శ్రీ కె. కేశవరెడ్డి, ఎం. ఎల్. ఎ. పార్కాల్

49. శ్రీ ఎస్. వి. కె. ప్రసాద్, ఎం. ఎల్. ఎ. జనగాం

50. శ్రీ జి. గోపాలరెడ్డి, ఎం. ఎల్. ఎ. జనగాం

51 శ్రీ జి. రామలింగం, ఎం. ఎల్. ఎ. జనగాం

52. శ్రీ చెరుకు కొంతయ్య, అధ్యక్షుడు, సిటీ మునిసిపాలిటి, వరంగల్లు.

53. శ్రీ బి. హెచ్. చంద్రమౌళేశ్వరరావు, భారత సేవక్ సమాజ్ (కన్వీనరు)

54. శ్రీ పి. రంగరావు, పొన్నకల్లు, నరసంపేట తాలూక

55. శ్రీ సి. వాసుదేవరెడ్డి, పార్కాల్

56 శ్రీ రావూరి వీరయ్య, అధ్యక్షుడు, పంచాయతి సమితి మహబూబాబాదు.

57. శ్రీ ఎం. రామస్వామి. జంగాలపల్లి, ములుగు తాలూక

58. శ్రీ బి. నారాయణ. ఆత్మకూరు, వరంగల్లు తాలూక

59. శ్రీ బి. రంగనాయకులు, సెక్రిటరీ టి. ఎ. సి. ఎ. వరంగల్లు

60. శ్రీ ఎస్. రామాచారి, సర్‌పంచ్, తాటికొండ

61. శ్రీ కంది పీతారెడ్డి సర్‌పంచ్, చెన్నారావుపేట, నరసంపేట తాలూక

62. శ్రీమతి ఇ. అనసూయాదేవి. వరంగల్లు

63. శ్రీ సి. హెచ్. విశ్వనాథమ్. గూడూరు, జనగాం తాలూక

64. శ్రీ డాక్టర్ టి. ఎస్. మూర్తి, వరంగల్లు
65. శ్రీ ఎస్. యాదగిరి, రఘునాథపల్లి, జనగాం తాలూక
66. శ్రీ ఎన్. యతిరాజారావు, అధ్యక్షుడు, జిల్లా కాంగ్రెసుకమిటి, వరంగల్లు
67. శ్రీ టి. సత్యనారాయణరావు, మహబూబాబాదు
68. శ్రీ ఒ. రామ్‌దేవ్, వరంగల్లు
69. శ్రీ పి. ధర్మారెడ్డి, పార్కాల్
70. శ్రీ కొంగా భద్రియ్య, ఎల్లందు, వరంగల్లు తాలూక
71. శ్రీ శ్రీరాములు నాయుడు, అంబర్‌చర్ఖా పరిశ్రమాలయం, వరంగల్లు
72. శ్రీ ఎం. మధుసూధన్‌రావు, జనగాం
73. శ్రీ వి. రామగోపాల్‌రావు, పల్లుగుట్ట వరంగల్లు తాలూక